# విక్రమనామ సంవత్సర — మార్గశిర - పుష్యమాసములు

1940-వ సం॥ డిసెంబరు

| | | |
|---|---|---|
| 1 | ఆ | ద్వి 7.10 మూల 21.26 ది 17.41 రా 16.22 |
| 2 | సో | తృ 2.54 పూషా 19.18 రా 11.1 |
| 3 | మం | చ 0.26 ఉషా 19.2 రా 1.9 నాగపంచమి |
| 4 | బు | పం 0.5 శ్ర 20.48 రా 3.14 చంపాషష్ఠి |
| 5 | గు | ష 1.47 ధని 24.32 రా 16.3 షష్ఠివ్రతం |
| 6 | శు | స 5.31 శత 30.7 రా 19.50 మిత్రసప్తమి |
| 7 | శ | అ 10.48 పూభా 37.6 |
| 8 | ఆ | న 17.15 ఉభా 44.48 ది 4.11 |
| 9 | సో | ద 24.2 రే 52.38 ది 18.43 సత్యనిధి |
| 10 | మం | ఏ 30.38 అశ్వి 59.58 రా 20.38 సర్వ-కౌశిక-ఏకాదశి - |
| 11 | బు | ద్వా 36.27 భర 60.0 ది 26.34 మత్స్య-అఖండ-ద్వాదశి [జయంతి |
| 12 | గు | త్ర 41.8 భర 6.8 రా 11.1 కృత్తికా-వ్రతం-దీపం, ప్రదోషం, హనుమత్ |
| 13 | శు | చశి 44.31 కృ 11.46 చతుర్దశీతిథి [విష్ణు సర్వాలయ దీపం |
| 14 | శ | ○ 46.35 రో 15.52 శే 0.30 రా 2.25 దాపేరవిః 56.10 పూర్ణిమాతిథి |
| 15 | ఆ | ప్ర 47.26 మృ 18.38 రా 12.9 మార్గశిర బహుళం |
| 16 | సో | ద్వి 47.10 ఆరు 20.20 రా 22.36 |
| 17 | మం | తృ 45.58 పున 21.2 రా 12.54 |
| 18 | బు | చ 44.0 పుష్య 20.53 రా 24.29 సంకటచతుర్థి |
| 19 | గు | పం 41.17 ఆశ్లే 20.0 రా 21.11 |
| 20 | శు | ష 37.58 మఖ 18.29 రా 9.44 |
| 21 | శ | స 34.2 పుబ్బ 16.25 రా 5.34 మకరాయనం 57.17 |
| 22 | ఆ | అ 29.29 ఉత్త 13 49 రా 5.34 |
| 23 | సో | న 24.22 హస్త 10.24 రా 1.4 నవమితిథి |
| 24 | మం | ద 18.42 చిత్త 6.37 ది 19.38 తిథిద్వయం |
| 25 | బు | ఏ 12.43 స్వా 2.25 విశా 58.0 ది 15.23 సర్వైకాదశి ద్వాదశితిథి |
| 26 | గు | ద్వా 6.32 అనూ 53.39 ది 7.27 ప్రదోషం |
| 27 | శు | త్ర 0.28 చశి 54.46 జ్యే 49.37 ది 6.43 శివరాత్రి |
| 28 | శ | ● 49.47 మూల 46.17 ది 8.30 రా 14.25 అమావాస్య |
| 29 | ఆ | ప్ర 45.55 పూషా 43.59 ది 9.29 పుష్య శుద్ధం |
| 30 | సో | ద్వి 43.32 ఉషా 43.7 ది 3.41 రా 25.8 |
| 31 | మం | తృ 42.45 శ్ర 43.50 |

# విషయసూచిక



వర్ణచిత్రము: విజయసారథి




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

## విజయ సారధి

కలనుగననీ కారు మబ్బులు
ముందు విననీ మరల మ్రోతలు
జేరుచున్నవి జంబు భూమిని
పూర్వపశ్చిమ బురులనుండి
బరగుచున్నవి పగలురాత్రి

మెరయుచుండెను ధృవపుచుక్కై
శాంతమూర్తి గాంధి దేవుఁడు
జూపు చుండెను సుకర మార్గము
మృత్యుదేవత మ్రోలబడక
విశ్వసింపుడి, విజయ సారధి!

—'దేవకీ నందన'

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● మార్గశీర్ష మాసము ●

**అశ్విని**

విద్వత్సమాగమం; ధనలాభం; దైవభక్తి.

**భరణి**

గురుభక్తి; సౌఖ్యం; ఆభరణలాభం.

**కృత్తిక**

ప్రీతి; లాభం; సుఖభోజనం; భోగం.

**రోహిణి**

సౌభాగ్యం; గోలాభం; కృషిమూలమున ఫలం.

**మృగశిర**

రాజభయం; శిరోవ్యాధి; దుఃఖము.

**ఆర్ద్ర**

కోపము; ఉపవాసం; ప్రయాణం.

**పునర్వసు**

స్వల్పాధికారం; విషభీతి; యుద్ధభయం.

**పుష్యమి**

వస్త్రలాభం; జంతువులచే భయం; పరులవలన బాధ.

**ఆశ్లేష**

వ్యాజ్యచిక్కులు; విచారం; స్వదేశపరిత్యాగము.

**మఖ**

బంధుసమాగమం; శుభవార్త వినుట; ప్రయాణములో ధనలాభం.

**పుబ్బ**

గురుమూలమున ధనలాభం; జ్ఞానం; ఆరోగ్యం.

**ఉత్తర**

ఆహ్లాదం; ధర్మకార్యం; ఇష్టభోజనం.

**హస్త**

భోగభాగ్యం; రాజదర్శనం; లాభం.

**చిత్త**

ప్రయాణములో క్లేశం; దేహబాధ; కార్యవిఘ్నం.

**స్వాతి**

ధననష్టము; అనారోగ్యం; మోసము.

**విశాఖ**

దుష్టస్త్రీ కలహం; గృహచ్ఛిద్రం; తేజోహాని.

**అనూరాధ**

గర్భశూల; పుత్రవియోగం; వ్రయం.

**జ్యేష్ఠ**

ఆయుధభయం; మనోచాంచల్యం; నిష్ఠూరము.

**మూల**

ద్రవ్యలాభం; సత్సహవాసం; క్షేత్రదర్శనం.

**పూర్వాషాఢ**

వినోదగోష్ఠి; సంతానసౌఖ్యం; యశోవృద్ధి.

**ఉత్తరాషాఢ**

ఆనందం; యత్నకార్యలాభం; గౌరవము.

**శ్రవణం**

పశువృద్ధి; సంపత్తు; పుష్పాలంకారం.

**ధనిష్ఠ**

అగ్నిభయం; విరోధం; శాంతిలేకపోవుట.

**శతభిషం**

చోరభయం; వాదం; ఆందోళన.

**పూర్వాభాద్ర**

వ్యయం; ధాన్యనాశం; విచారం.

**ఉత్తరాభాద్ర**

కార్యవిఘ్నం; మతిభ్రంశం; వ్యాధి.

**రేవతి**

పరితాపం; దేశాటనం; ఉద్యోగభయం.

# శ్రీ రావు ఇందిరాదేవి స్మృతి

శా. అమ్మా! మీరిలఁ బాయుటల్ నిజమొకో? యత్యంత ప్రేమన్
విలాసమ్ముల్ గూర్చెడు భర్తఁ బాసి, తమకున్ స్వాంతంబుఁ బొంగించు
చిన్నమ్మన్, ముద్దుల బిడ్డనిన్ విడచి, యన్యాయమ్ముగా నేగఁ బంతమ్మొ
దేనియుఁ గల్గెనా? చెపుడు, మాతా, యిందిరా దేవిరో!

ఉ. ఎంతటి వెఱ్ఱి ప్రశ్న! మదినెంతునుఁ మీరిలఁ గాంతు వీడగా;
నెంత తపంబుఁ జేసి జనియించితిరో భువి మాదు సూర్యభూ
కాంతునిఁ జెట్టఁ బట్ట, సతిగా నతనిన్ దరిలేని ప్రేమఁదే
లింతు నటంచు నమ్మి; యటు లేగుదురా తమరిందిరా సతీ!

మ. అదియుంగాక, తరంబె బ్రహ్మకయినన్ యావత్ప్రపంచంబు నె
మ్మదిలోనం దృణమంచు నెంచు తమ ప్రేమన్ ద్రుంప యత్నింపగా
నిదియే నిక్కువమైనచో జగములోనే లేదు సౌఖ్యంబు; ప్రే
మఁ దలిర్పన్ జగమేల, లేడె ప్రభు! యమ్మా యిందిరా దేవిరో!

గీ. తమరె ప్రాణంబు సూర్య భూధవున, కతడె
తమకుఁ బ్రాణేశుఁ డెన్ని జన్మములకైన,
లేదు తమ కెపు డెడబాటు లేదు లేదు;
కాంతు హృత్సీమ వసియించు కన్నతల్లీ!

చ. తమ యసమాన రూపము, సదా చిరునవ్వులఁ జిల్కు మోము, మో
దము నొడఁగూర్చు వాక్సుధయు, ధర్మగుణంబు ననన్య సాధ్య శీ
లమును బతివ్రతాత్వము, నిలన్గననూని విశాలదృష్టి మీ
విమల చరిత్ర, మా హృదయ వీధుల నున్నది, యిందిరాంబరో!

—మల్లెమడుగుల సత్యనారాయణ.



స్వర్గీయ రావు ఇందిరాదేవి
( శ్రీశ్రీశ్రీ పిఠాపురం రాజకుమార్ వారి ధర్మపత్ని )




దసరా సంచికలోని

# 'సజీవమైన వాఙ్మయం కావాలి'

అనే శ్రీమతి 'రోహిణి' గారి

సారస్వత హెచ్చరికకు క్రొత్త వెలుగులు

గృహలక్ష్మి దసరాసంచికలో 'రోహిణి' గారు చెప్పినట్లుగా ప్రాచీన వాఙ్మయాన్ని మించేది కాని, లేక దానితో తులతూగేది గాని లేకపోవడంవల్ల నేటి మన సాహిత్యాన్ని గురించి చెప్పుకోవాలంటే ఉత్సాహం సన్నగిల్లుతూవుంది. ఇది నిజంగా మన దౌర్బల్యాన్ని సూచిస్తూవుంది.

సాహిత్యమెప్పుడూ ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. అందుచేత నేడు సాహిత్యవికాసం సన్నగిల్లుతూ ఉందంటే దీనికి ప్రధానకారణం జాతి దౌర్బల్యమే కాని వ్యక్తిగత దౌర్బల్యం కాదు. ప్రపంచంలో యేభాషా చరిత్రలు చదివిచూచినా మనకిదే విషయం గోచరమౌతుంది. ఆయా జాతుల స్థితిగతుల్నిబట్టి ఆయా భాషల్లో కాలానుగుణ్యంగా పరిణామం కల్గుతూనే ఉంది. దీని కుదాహరణగా ఆంధ్ర సారస్వతంలో నన్నయభట్టునుంచి ఇప్పటివరకు కలిగినమార్పుల్ని పరిశీలిస్తే మనకీవిషయం స్పష్టమౌతుంది.

సాహిత్య మెప్పుడూ ప్రజాభిప్రాయానికి ప్రతిబింబంగా ఉంటుంది. మనదేశంలో ప్రజ లెక్కువగా విద్యావిహీనులు కావడంచేత ఉదరపోషనార్థం కవులు రాజాశ్రయం అపేక్షించారు. అందువల్ల ప్రాచీన సాహిత్యంలో ప్రజాభిప్రాయంకంటె రాజాభిప్రాయమే రాణించింది. అందులోగూడా కవులకు రాజులకు ఉండే సన్నిహిత సంబంధాన్నిబట్టి క్రమంగా మారుతూ వచ్చింది.

ఆంధ్ర సాహిత్యంలో ఆదికవి నన్నయభట్టు; రాజరాజుకు ఆస్థానకవి. అప్పుడు ఆంధ్రదేశం అన్ని విధాలా ఔన్నత్యంలో అలరారుతూఉంది. తర్వాత కవులమాదిరి నన్నయభట్టు రాజుకు కేవలం ఆశ్రితుడుగానో లేక దాసుడుగానో కన్పించకుండా గురుతుల్యుడుగా గోచరిస్తాడు. అందుకనే భారతాన్ని లోకోపకారార్థం తెలిగిస్తున్నానని చెప్పుకో కలిగినంత స్వతంత్రుడయ్యాడు. మనుమసిద్ధి కాలంలో తిక్కన గురుతుల్యుడు కాకుండా అమాత్యపదాదరణకు పాత్రుడయ్యాడు. తర్వాత శ్రీనాథ కవిసార్వభౌమునిలో రాజాశ్రయం ప్రజాశ్రయం రెండూ కనుపిస్తున్నవి. రాజులను రంజింపజేసే శృంగారనైషధం మొదలు ప్రజాభిప్రాయం ప్రతిబింబించే పల్నాటివీర చరిత్రవరకూ వ్రాయగలిగాడు. "దీనారటంకాలతీర్థ మాడించిన" రాజపూజితుడు జొన్నకలి, జొన్నయంబలికూడా చవిచూచాడు. అందుకనే ఆయనకవిత్వంలో అంతవైవిధ్యం వైచిత్ర్యం ప్రస్ఫుటంగా కనుపిస్తూవున్నవి. మళ్ళీ ఆంధ్రభోజుని కాలంలో ఆంధ్రసామ్రాజ్యం అభివృద్ధిలోకి వచ్చింది. శత్రురాజుల దండయాత్రలు లేకపోవడంచేత ప్రజలు హాయిగా జీవయాత్రలు సాగించినరోజులవి. రాజాశ్రయంలో పరరాజకన్యలతోపాటు కవితాకన్యకూడా భోగాసక్తురాలయింది. కాబట్టే కవులందరూ శృంగారరసమే ప్రధానంగాగల ప్రబంధాలు రచించారు. ఈకాలంలో దాదాపు కవులందరు గురుత్వ అమాత్యపదవులనుండి ఆశ్రితులుగామారారు. ఆంధ్రసామ్రాజ్యం కృష్ణరాయల తర్వాత క్షీణించుతూ రామరాయలుతో అస్తమించింది. సామ్రాజ్యంగతే సాహిత్యానికికూడా పట్టింది. ప్రజలతోపాటు కవులుకూడా దాసులయ్యారు. దీనితో సాహిత్యంలో అంధయుగం ప్రారంభమయింది. మెచ్చియిస్తే 'చంద్రరేఖావిలాసం' లేకపోతే 'చంద్రరేఖావిలాపంగా' మారింది కవిత్వం. ఇంతలో మనదేశాన్ని ఆంగ్లేయులు ఆక్రమించారు. పరదాస్య ప్రవృత్తిలోనే ప్రజలకు కొంత స్తిమితం చిక్కింది. పాశ్చాత్యభాషా సంపర్కంవల్ల మన సాహిత్యంలో ఆధునికయుగం ప్రారంభమయింది.

ఇంతకుపూర్వం మనసాహిత్యం కేవలం పద్యప్రధానంగా నడచింది. ప్రస్తుతం విజ్ఞానాభివృద్ధితో పాటు భాషాయోషకూడా కావ్యాలు, గేయాలు, నాటకాలు, నవలలు, వ్యాసాలు, కథలు, చరిత్రలు,

స్వీయచరిత్రలు మొదలయిన సర్వాంగములతో దినదినాభివృద్ధి పొందుతూవుంది. అనేకమంది అనేక నూతన పంథాల్లో ప్రయత్నంజేస్తున్నారు. కొన్నిశాఖల్లో కొంతమంది రచనలు తృప్తికరంగానే ఉంటున్నవి. ఈ ఆధునిక రచనల్లో ఏది ఎంతవరకు శాశ్వత సారస్వతంలో చేరుతుందో ముందుకాలమే నిర్ణయిస్తుంది. తాత్కాలికమైన పేరుప్రతిష్టల్నిపట్టి సమకాలికుల్ని నిర్ణయించడం సాహసమౌతుందేమో!

ప్రాచీన సాహిత్యంలో యే దేశంలోనైనా యే యిద్దరు ముగ్గురు కవయిత్రులో తప్ప చెప్పతగినంత యెక్కువగాలేరు. కవులతో తులదూగే కవయిత్రులు అప్పుడుగానీ ఇప్పుడుగానీ లేకపోవడానికి కారణం పురుషులతోపాటు సమానంగా స్త్రీలకుకూడా రాజకీయ, సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యము లేకపోవడమే. స్త్రీలను పురుషులు అమానుషమైన ఘోషాబందిఖానాలో ఉంచి పశువుల్లాగా, వంటయింటి పనిముట్లుగా, భోగవస్తువులుగా, దాసీలుగా తయారుచేశారు. ఇట్టి అస్వతంత్రసంఘంలోనుంచి ఉన్నతస్థానం అలంకరించే మహిళామణులు రాలేదంటే దీనికి పురుషులుజేసుకొన్న స్వయంకృతాపరాధమే. ఇప్పుడిప్పుడి కొంచెం ఘోషాలు తగ్గిపోతూ ఉండడంవల్ల కొంతమంది స్త్రీలైనా వృద్ధిలోకి రాగల్గుతున్నారు. తెలివితేటల్లో పురుషులకంటే స్త్రీ లేశమాత్రం తీసిపోరు. ఇక ముందైనా వారితోపాటు అన్నివిషయాల్లోను సమాన హక్కులుంటే స్త్రీ లేశమాత్రం వెనకబడరనడానికి ముమ్మాటికీ యేమీ సందేహంలేదు.

—వట్టికొండ విశాలాక్షి.

# నాదుమహతి

నామహతికి తంత్రులెన్నో
లెక్కలేనన్ని వున్నాయీ!
నాదుమహతితో నాలపించుట
కేనునొక్కడ తగుదునోయీ!
తంత్రినొక్కటి మీటుకొనుచూ
దివ్యపురుషుల దింపగలనూ!
తీగనొక్కటి కదుపుకొనుచూ
తీవబోడుల ద్రిప్పగలనూ!
పాటనొక్కటి పాడుకొనుచూ
పాములన్నిటి బట్టగలనూ!
తంత్రినొక్కట తాళమేసీ
తాండవానికి తావునిత్తును!
తీగనొక్కడ దలపుపెట్టీ
తీయబలుకుల బలుకనిత్తును!
రాగమొక్కటి రగులుకొలిపీ
భంగిమబ్బుల బొదిగివేతును!

ముదముగూర్చే ముగుదముచ్చట
ముచ్చటించే మేళమొకటి!
నృత్యగీతము నేర్పడానికి
నాలపించే నాదమొకటీ!
కావ్యగానపు కల్పనానికి
కథలనిచ్చే కంఠమొకటీ!
కొమ్మయందలి కోయిలమ్మతో
కలసిపాడే కాలమొక్కటి!
ఏటిరొదలనె యేరుకొనుచూ
వాటిసరణిని వరసయొక్కటి!
భీతిగొలిపే యలలఘోషలు
పిక్కటిల్లే ఫణితియొక్కటి!
నాదుమహతితో నాలపించుట
కేనునొక్కడ తగుదునోయీ!

—పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు.

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



ఈ గురు వ్రేలియొక్క మొదటి కనుపునకు (గోరుతోకూడినది) మేషరాశియనికూడ పేరు.

ఈ కనుపుమీద నక్షత్ర రేఖయుండిన గొప్ప ధనవంతుడు, సంపదగలవాడు.

నిలువు రేఖయుండిన మిక్కిలి ఆలోచన, సుగుణము, వాచాలత్వము యుండును. తర్కవాదము నందు ఆసక్తియుండును.

గురు వ్రేలియొక్క రెండవ కనుపునకు వృషభరాశి యనిపేరు. దీనిమీద రెండు కత్తెరరేఖలుండిన ధనవంతులతో చెలిమిగల్గును. నిలువురేఖ యుండిన పరులను పీడించుస్వభావము; అబద్ధము చెప్పువారు. నక్షత్ర చిహ్నముండిన, దుర్నీతిని సూచించును. గురువ్రేలియొక్క మూడవకనుపునకు మిధునరాశి యనిపేరు.

దీనిమీద వంకరరేక యుండిన అన్యులవద్దనుండి ధనము సంప్రాప్తించును.

రెండు సమాంతర రేఖలుండిన మంచితనము, ధర్మగుణము సూచించును.

మూడు నిలువురేఖ లుండిన స్వయముగా ధనార్జనము చేయును.

గురువ్రేలి గోటిమీద తెల్లమచ్చయుండిన ధనముండును. నల్లమచ్చ యుండిన తనకున్నధనమును గోల్పోవును.

ఈ వ్రేలిమీద చక్రముండిన పితృ ధనమువచ్చును, లేక స్నేహితుల ధనమబ్బును; చక్రముగాక వేరే చిహ్నములుండిన వారికి రాబడికన్న ఖర్చు ఎక్కువగ నుండును.

మరియు నీ వ్రేలిమీద రేఖలు చీలికలై యుండిన ఆ స్త్రీ విధవయగును.

## నడిమి వ్రేలు——

నడిమివ్రేలు, లేక శనివ్రేలు సుఖ దుఃఖములను, జ్ఞానా జ్ఞానములను నిరూపించును.

ఈ శనివ్రేలు వంకరలు తిరిగియుండిన క్రూర స్వభావము - హత్య చేయువారుగా నుందురు.

ఉంగరపు వ్రేలికన్న చాలా పొడవుగానుండిన రోగమువలన మనిషి క్షీణించును. విద్యా భంగము గల్గును.

ఉంగరపు వ్రేలికన్న కురుచగానున్న అజాగ్రత, సాహసము, మొండిచొరవ గలిగి యుండును. సమముగానున్న జూదము, త్రాగుడు సూచించును.

శనివ్రేలి మొదటి కణుపునకు కటకరాశి, రెండవ కణుపునకు సింహరాశి, మూడవ కనుపునకు కన్యారాశి యనియు పేర్లు.

ఈ మొదటి కణుపు కొనదేరి యుండిన పరుష స్వభావము, విస్తరించియుండిన ఆలోచన పరులు, చదరముగానున్న, కృషియందు అసక్తి, ధర్మానురక్తి. శని వ్రేలి గోటిమీద తెల్లమచ్చ యుండిన దేశసంచారము. నల్లమచ్చయుండిన తండ్రికి, తనకు అనారోగ్యము. (సశేషము)

# ★ రా జ ము కు ట ం

రచయిత :
శ్రీ గోవింద వల్లభ పంతు.

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

## ముందు కథ

చిత్తోడు మహారాణా విక్రమసింహుని మధుపాన మత్తుణ్ణిచేసి, రాజ్యపాలనాన్ని కంటకంగా పరిణమింపజేశాడు కుటిలసర్దారు రణజిత్తు. ఈ మధుపాన మత్తతలో కష్టాల్ని చెప్పుకోవచ్చిన దుఃఖినిని, ప్రజలను అవమానించాడు; తనకు విరోధియైన శీతలసేనినికూడా నిర్లక్ష్యంచేశాడు రాణా. అంతఃపుర దాసి పన్నా ప్రవేశించి, [illegible] తన రక్తతర్పణములతో [illegible] ప్రతిజ్ఞ పట్టింది. [illegible] వనవీరుడు [illegible] విద్రోహత్వాన్నిగురించి చెప్పి, తాను రాణాకు కుడిభుజంగా వుంటానని ప్రమాణంచేశాడు.

### పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1. విక్రముడు | ... | మేవాడ్ మహారాణా | |
| 2. రణజిత్తు | ... | ఒక లోభి సర్దారు | |
| 3. వనవీరుడు | ... | శీతలసేని పుత్రుడు | |
| 4. జయసింహుడు | ... | కర్మచందు పుత్రుడు | |
| 5. కర్మచందు | ... | ప్రధానమంత్రి-వృద్ధుడు | |
| 6. ఉదయసింహుడు | ... | విక్రముని తమ్ముడు | |
| 7. చందర్ | ... | పన్నా పుత్రుడు | |
| 8. పన్నా | ... | ఉదయుని దాది | |
| 9. శీతలసేని | ... | వనవీరుని తల్లి | |

# ప్రథమాంకము

## ౧. దృశ్యము

(వనవీరుని భవనం : శీతలసేని పాడుకుంటూ ప్రవేశిస్తుంది.)

కాఫీరాగం—జప్ తాళం

అవమాన దవాగ్ని !
నా చిత్తములో దరికొనుమీ.

౧

శాత్రవుల తేజమ్ము క్షయము కావాలి
భయభావములు నన్ను వదలి పోవాలి
అదృష్టము పట్టాలి !

శీతలసేని :-రాజమాతను కావాలన్న ఈ కోరిక ఎన్నాళ్లనుంచి నా హృదయంలో మెదలుతున్నదో చెప్ప లేను. సమయమిపుడు అనుకూలంగా కూడి వచ్చింది. విక్రముడు నాకు గావించిన అవమానమే నన్ను మాన్యపదవి కెత్తగలదు. విక్రముని స్థానే వనవీరుని మహారాణాను చేయడానికి సర్దార్లంతా గట్టి పట్టుదలతో ఉన్నారు. నేను రాజమాతనౌతాను.

(రణజిత్తు ప్రవేశిస్తాడు)

రణజిత్తు :-మరి నేనూ ?

శీతలసేని :-విన్నావూ ? బలే చతురుడివి సుమా ! మంచిది, నీవు ప్రధానమంత్రి వౌతావు. కాని అందుకు నీవేమైనా ప్రయత్నాలు చేస్తున్నావా మరి ?

రణజిత్తు :-చేయకేం ? విక్రముడికి తెలీకుండా ప్రజల్లో ఈ విప్లవాగ్ని రగిల్చిందినేనే; ఆయన సమక్షంలో మాత్రం మిత్రుడులాగ కనిపించేవాణ్ణి. ప్రజల దుఃఖాల్ని తొలగించాలనే ఆలోచనలో ఆయన ఉన్నప్పుడల్లా పరిపూర్ణ సురాపాత్ర చేతి కందించేసేవాణ్ణి.

శీతలసేని :-నీవంటివాడి సహాయంవల్ల నా ఆరంభం - సందేహంలేదు - ఫలిస్తుంది.

రణజిత్తు :-కాని నా భయమేమిటంటే - [illegible] !

శీతలసేని :-ఏమీ భయంలేదు. రణజిత్ ! కావాలంటే [illegible]. (కాగితం ఇస్తుంది)

రణజిత్తు :-చదవనీయండి. (కాగిత మందుకుని చదువుతాడు) "రాణి శీతలసేని రాజమాత అయేందుకుగా సర్దారు రణజిత్తు సహాయంచేసే యెడల, అతనికి మేవాడధిపతి వనవీరునివద్ద ప్రధాన మంత్రిపదవి మంజూరు చేయబడుతుంది.

శీతలసేని.

(కాగితం జాగ్రత్తగా మడిచి లోపల జేబులో పెట్టుకుంటాడు)

శీతలసేని :-కాని, రణజిత్ ! మన మెన్నడూ అనుకోనుకూడా అనుకోని విఘ్న మొకటి తటస్థించింది.

రణజిత్తు :-ఏమిటబ్బా అది !

శీతలసేని :-(విచారంగా) వనవీరుడు విక్రమునికి ప్రాణమిత్రుడు. అతన్ని సింహాసనం దింపించి తాను రాజ్య పదవి స్వీకరించటానికి మన మెంతచేసినా ఒప్పుకోడు.

రణజిత్తు :-అయితే, వాళ్లిద్దరిమధ్యా విరోధలతిక మొలిపించటం ఈ సేవకుడికి ఎడమచేతి ఆట !

శీతలసేని :-అది ఈ గోజే మొలవాలి ! పుష్పించాలి; ఫలించాలి కూడాను. ఇదిగో, ఈ కటారు పుచ్చుకుని అక్కడెక్కడేనాదాగి ఉండు. (కటారు ఇస్తుంది) వనవీరు డిప్పుడే ఈవేపువస్తాడు. రాగానే అతన్ని వధించే——

రణజిత్తు :-(కటారు విసిరివేసి, అర్థోక్తిలో) వద్దు. తల్లీ ! వద్దు. ఇదా తీరా మీరు ఉపదేశించుతున్నది ?

శీతలసేని :-అతన్ని వధించేంత హంగామా చెయ్యి. అంతే అతన్ని కిందపడవేయటం, కటారులో పొడవ బోవటం - అంతా తంత్రరచన.

రణజిత్తు :-ఓహో, ఇప్పుడు తెలిసింది. (నేలమీది కటారు తీసుకుంటాడు)

శీతలసేని :-ఆ సమయాన నేను వెనుకనుంచి వచ్చి నీకత్తియెత్తిన చేయి పట్టుకుని నిన్ను బంధించుతాను.

రణజిత్తు :-(అదరిపడి దూరంగా పరుగెత్తుతాడు. మళ్లీ కత్తి కిందపారేస్తాడు. రెండు చెవులు మూసుకుం టాడు) అరి, భగవంతుడా ! బంధించి ఉరితీయించుతావు. అంతేకదూ ! ఈ పని నావల్లకాదుతల్లీ !

శీతలసేని :-అయితే, ఆ లిఖితపత్ర మిటు తే. దానితోపాటు మంత్రి పదవిమీద ఆశకూడ వదలుకో.

(పత్రముకోసం చెయి చూపుతుంది)

రణజిత్తు :-ఊహుం ఇది ఇచ్చివేయటం నా కిష్టంలేదు.

శీతలసేని :-అయితే-మంత్రిపదవిమీద నీకంత తీవ్రవాంఛ ఉంటే నీళ్లల్లో, నిప్పుల్లో ఉరకటానికి సిద్ధపడి ఉండాలి.

రణజిత్తు :-సరే, చెప్పమ్మా ! అది ఎటువంటి మహా సాగరమో ! ఎటువంటి అగ్నిగుండమో ! చెప్పు. ఒక్క సారిగా దూకేస్తాను.

శీతలసేని :-దీన్ని తీసుకో; నిండా కప్పుకో (ముసుగొకటి ఇస్తుంది) నే నన్నానుగా నీ విముక్తికి ఉత్తరదాతను.

రణజిత్తు :-ఖేమ్. ఇప్పుడు బాగా తెలిసిపోయింది. అయితే ఇదే మంత కఠినమైన పని కానేకాదు. ఇక చూద్దురుగాని — ఈ రణజిత్తుగాడి హస్త కౌశలాన్ని.

శీతలసేని :-ఇది కప్పుకుని ఆ గదిలో దాగి ఉండు. మాటలధోరణిలో పెట్టి వనవీరుని ఇక్కడే నిలిపేస్తాను. కొంతసేపైన తర్వాత నీవు హాగచేసి వెళ్లిపోతాను. అప్పుడు నీవు తటాలున వనవీరుని దుమికి, అతన్ని కింద పడవెయ్యి. తక్షణమే నేను నిన్ను కుదరుగా పరుగెత్తిస్తాను. త్వరగా వెళ్లు. అదిగో వనవీరుడు వస్తున్నట్టున్నాడు.

రణజిత్తు :-అలాగే. (నిష్క్రమిస్తాడు.)

శీతలసేని :-ఛీ, ఛీ, ఎంత అవమానం ! (వనవీరుడు వచ్చి వింటూ ఉంటాడు) నువ్వు నన్ను జుట్టుపట్టిలాగావు. 'దాసి, వేశ్య' అన్నావు. హా, భగవంతుడా ! నా పుత్రుడు వనవీరుని భుజాల్లో బలంలేదూ !

వనవీరుడు :-(ప్రవేశిస్తూ) మా అమ్మకు అవమానమా ? ఎవడా సాహసుడు ?

శీతలసేని :-ప్రతీకారం సెరపగల పౌరుషరక్తమేనా నీ నరాల్లో ప్రవహించేది ?

వనవీరుడు :-ఎందుకు కాదు ? (కత్తి దూస్తాడు.)

శీతలసేని :-మాతృరుణముంచుకోని సత్పుత్రుడనిపించుకో. ఈ క్షణమే విక్రముడెక్కడున్నాడో అన్వేషించు; అతడే నీ తల్లిని 'వేశ్య' అన్నాడు. స్వాభిమానం అంచులువారిఉన్న ఆమస్తకాన్ని మొండెమునుండి వేరుచెయ్యి.

వనవీరుడు :-(కత్తి విసరిపారేసి) అట్లనకమ్మా. విక్రముడు పరాయివాడా ? నావంటి పుత్రుడేకాదూ ! కొడుకెప్పుడూ తల్లిని అవమానించడు. తల్లి సదా కొడుకు దుడుకుతనాన్ని క్షమిస్తుంది.

శీతలసేని :-క్షమ ! వనవీర్ ! క్షమించమంటున్నావా ? హా ! భగవంతుడా ! ఇప్పటికి తెలిసివచ్చింది; నేను వంధ్యను ; నా ఒడిలో పుత్రుణ్ణికాదు పెంచాను, పంజరంలో పక్షిని.

వనవీరుడు :-ఈ అగ్నికణంమీద గాలికాదమ్మా విసరవలసింది ; ఇన్ని నీళ్లు చిలుకు. పద ! విక్రముడు నీ కాళ్ల మీద పడి క్షమాపణ వేడుకుంటాడు. ఈ కరవాలము మేవాడ్ శత్రుసంహారమునకు మాత్రమే ఉపయోగపడుగాక ! (నేలమీదినించి కత్తి అందుకుని ఒరలో పెట్టుకుంటాడు.)

శీతలసేని :-మేవాడ్‌కు శత్రువు లెవరున్నారిప్పుడు విక్రముడు తప్ప ? నీవు తల్లికి జరిగిన అవమానాన్నికూడా సహిస్తావు. పోనీ, ప్రజల దీనదశకు విచారమైనా కలగటంలేదూ నీకు ?

(జయసింహుడు నలుగురు సర్దార్లతో ప్రవేశిస్తాడు.)

జయసింహుడు :-నీవు మా తీర్మానంగురించి ఆలోచించుకున్నావు కదూ! విక్రముని సింహాసనం అధిష్టించేందుకు సిద్ధంగా ఉన్నావా, లేదా? ఏం చెబుతావు?

వనవీరుడు :-రాజమకుట హీనుడై విక్రముడేమాతాడు?

జయసింహుడు :-కోటలోని అంధకార కారాగృహంలో ఉంటాడు; ఆ మరణాంతమూ చేసిన పాపాలకు ప్రాయశ్చిత్త మనుభవిస్తాడు.

వనవీరుడు :-నీ తండ్రిగారి ఉద్దేశమూ అదేనా?

(కర్మచందు ప్రవేశిస్తాడు.)

కర్మచందు :-ఔను, నాయనా! నా జన్మంతా ఈ మేవాడ్ సేవయందే వినియోగిస్తున్నాను. మన రాజ్యము పట్ల నాకెన్నడూ అహితచింతలేదు.

వనవీరుడు :-అయితే, విక్రముని చిన్నతమ్ముడు ఉదయుడున్నాడు; అతడికి పట్టాభిషేకం చేయండి.

కర్మచందు :-అలా కాదు. ఉదయుడు కేవలం పసివాడు. అతనికి వయసు వచ్చేవరకూ మేవాడ్ రాజ్యాధిపత్యం నీవే వహించుము.

వనవీరుడు :-మరి విక్రముడు రాజమకుటముకూడ పోగొట్టుకొని కారాగారమందే ఉండవలసిన ఆవశ్యకత ఏమిటి?

కర్మచందు :-కారాగారపు కష్టాలు అతన్ని పశ్చాత్తప్తునిచేసి సన్మార్గానికి తిప్పవచ్చు. మేవాడ్ రాజ్య కళ్యాణముకోసమై అధికసంఖ్యాకులైన శుభచింతనులు అట్లే నిశ్చయించారు. నీవు మా తీర్మానాన్ని మన్నించినందుకు సంతోషం; మంచిది. మేము వెళ్లి నీ పట్టాభిషేకోత్సవము ప్రకటిస్తాం.

(పోబోతాడు)

వనవీరుడు :-కాని——

శీతలసేని :-(అడ్డువచ్చి) ఊరుకో! మేవాడ్ రాజ్యకళ్యాణ కార్యక్రమమున 'కాని' శబ్దం రాకూడదు.

(కర్మచందు, జయసింహుడు, సర్దార్లు నిష్క్రమిస్తారు.)

వనవీరుడు :-చాల వికట సమస్య! సమ్మోహనచణమైన సువర్ణ రాజమకుటము!

శీతలసేని :-(అప్పటికప్పుడు) మంచిది, ఇక నేను వెళ్లుతున్నాను.

(దాగివున్న రణజిత్తుకు సైగచేసి వెళ్లిపోతుంది. ఛద్మవేషముతో రణజిత్తు కటారు పుచ్చుకుని ప్రవేశిస్తాడు. వెనుకనుంచి హఠాత్తుగా వనవీరునిమీద దూకిపడతాడు. వనవీరుని కిందపడేసి కటారు ఎత్తిన తత్క్షణమే శీతలసేని ప్రవేశించి కటారు లాక్కుని, రణజిత్తును పారిపొమ్మని సైగచేస్తుంది. రణజిత్తు పరుగెత్తిపోతాడు.)

వనవీరుడు :-ఎవరు?

శీతలసేని :-నరపిశాచం! ఘాతకుడు! పరుగెత్తి పారిపోయాడు. పట్టుకోండి! పట్టుకోండి! (ఘాతకునివెంట పరుగెత్తబోతుంది. కాని వనవీరు డామెచేయిపట్టుకుని ఆపుతాడు.

వనవీరుడు :-అమ్మా! నీవు నన్ను రక్షించావు. వాడు పారిపోతే పోనీలే.

శీతలసేని :-ఆశ్చర్యంగా ఉందే; నిన్ను హత్యచేయటానికి ఎవరు వీడు వచ్చాడు?

(కటారుపై దృష్టి నిలుపుతుంది.)

వనవీరుడు :- నాకు శత్రువులెవరూ లేరు.

(ఛద్మవేషం తీసివేసి రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణజిత్తు :- విక్రముడు తప్ప. వనవీర్ ! అంత తెలుసుకోలేకుండా ఉన్నావేమయ్యా! సర్దార్లంతా కలిసి నిన్ను తన సింహాసనంమీద నిలబెట్టాలని చూస్తున్నట్టు విన్నప్పటినించీ విక్రముడు నిన్నెలాగేనా రూపుమాపాలని ఆలోచిస్తూనే ఉన్నాడు.

శీతలసేని :- సందేహంలేదు. ఈ ఘాతకుని పంపించింది విక్రముడే.

వనవీరుడు :- అదా సంగతి! ఆనాడు రాజసభలో నేనతని ప్రాణాలు కాపాడానే!

శీతలసేని :- అట్లనుకోకు. ప్రపంచమంతా అంతే. లే, మేవాడ్ సింహాసనాధిష్ఠానమునకు సిద్ధపడు. నీమార్గంలో ఆటంకములుగా ఉన్నవారిని నులిమివెయ్యి.

వనవీరుడు :- అమ్మా! అల్లే చేస్తాను. అతడు నన్నవమానించాడు. జనకతుల్యుడైన వృద్ధమంత్రిని - కర్మచందును తిరస్కరించాడు. ప్రజల్ని అనేకవిధాల కష్టపెట్టాడు. ఇవాళ అతడే నా ప్రాణాల్నికూడా మింగివేయ దలచాడు. నీ ప్రతీకారేచ్ఛ, సర్దార్ల బలవంతం, ప్రజల హాహాకారాలు, నా ప్రాణాలమీది తీపి ఇవన్నీ మేవాడ్ సింహాసనాధిష్ఠానమునకు నన్ను పురికొల్పుతున్నవి. చెప్పమ్మా, రాజమకుట మెక్కడున్నది?

(వనవీరుడు, అతనివెనుకనే శీతలసేని, రణజిత్తు నిష్క్రమిస్తారు)

(తెరపడుతుంది.)

## 3. దృశ్యము

ఉపవనములో చిత్తోడేశ్వరి ఆలయం. పన్నా చేతులుజోడించి ప్రార్థన చేస్తూఉంటుంది.

ఫీల్ రాగం - త్రితాళం

పన్నా :- నీరుచిరమూర్తి హృద్దేహములో
నీస్తుతిగీతిక అధరోష్ఠముపై
నీధ్యానంబే విచారములలో
నీపూజామాలిక చేతులలో.

[ ఎడమవైపునుంచి ఉదయుడు ప్రవేశిస్తాడు ]

ఉదయుడు :- ఆదిదేవతవు! పరమేశ్వరివి

[ కుడివేపునుంచి చందన్ ప్రవేశిస్తాడు ]

చందన్ :- రుద్రాణివి విలయాంతకారిణివి.

పన్నా :- తారల్లోనూ, పూవుల్లోనూ, ఉదధిలోననూ ప్రతిబింబితవూ.

ముగ్గురు :- నీధ్యానంబే విచారములలో నీపూజామాలిక చేతులలో.

[ ఉదయుడు, చందన్ నిష్క్రమిస్తారు ]

పన్నా :- నీరుచిరమూర్తి హృద్దేహములో నీస్తుతిగీతిక అధరోష్ఠముపై.

[ ఉదయుడు ప్రవేశిస్తాడు ]

ఉదయుడు :- అణువు అణువు నందూ నీ మహిమా.

[ చందన్ ప్రవేశిస్తాడు ]

చందన్ :- అడుగు అడుగునందూ నీ గరిమా.

పన్నా :- రాత్రి సమయముల తమస్సు నీవే. భానుకిరణముల వెలుతురు నీవే.

ముగ్గురు :- తేజము తమమూ నీవే సుమ్మా. విషమసమములూ నీవేనమ్మా.

ఉదయుడు :- ఆకాశములో నీలిమ నీవే.

చందన్ :- సమరభూమిలో కాళివినీవే.

ఉదయుడు, చందన్ :- నీ ధ్యానంబే విచారములలో, నీ పూజామాలిక చేతులలో.

ముగ్గురు :- నీరుచిరమూర్తి హృద్దేహములో,
నీస్తుతిగీతిక అధరోష్ఠములపై,
నీ ధ్యానంబే విచారములలో,
నీ పూజామాలిక చేతులలో.

[ ఒకపక్క ఉదయుణ్ణి, ఇంకోపక్క చందన్‌ను తీసుకుని పన్నా ముందుకు సాగివస్తుంది. ]

పన్నా :- మీ రిద్దరూ ఒకే చెట్టునుంచి వ్యాపించిన రెండు కొమ్మలు; ఒకే కొమ్మన వికసించిన రెండు పుష్పాలు; ఒకే పూవునుంచి ఉద్భవించిన రెండు కాయలు.

ఉదయుడు :- ఆ రెంటికీ నీవేకదమ్మా ఆధారం!

పన్నా :- నాకున్నది ఒక్కటే కోరిక : మేవాడ్ రాజ్యం నిత్యమంగళంగా ఉండాలి. అందుకే నే ననేకసార్లు మాతచిత్తోడేశ్వరీ ఆలయంలో ప్రార్థన సలిపాను. సంగ్రామసింహుని వంశానికి గౌరవకీర్తులు ప్రాప్తించుగాక! మేవాడ్ ప్రజలకు సుఖమౌగాక!

చందన్ :- సంగ్రామసింహుడు మన ఉదయుని తండ్రి. అమ్మా! ఆయన పేరు మాకు చాలసార్లు వినిపించావు; కాని మానాన్నను గురించి ఎన్నడూ చెప్పనే చెప్పవేం? సంగ్రామసింహ రాణా సైన్యంలో ఒక సైనికుడుగా ఉండేవాడని మాత్రం ఎప్పుడో చెప్పావు, అంతే.

పన్నా :- ఔను. ఆ తరవాత ఆయన కణవాహా యుద్ధానికి తన దక్షిణహస్తం ఉపహారంగా ఇచ్చి సైనిక వృత్తి మానేశారు. గుజరాతు సుల్తాను చిత్తోడును ధ్వంసంచేసి, మన ప్రాణాల్ని తప్ప ఏమీ మిగల్చలేదు. అప్పుడు నువ్వు చాల చిన్నవాడివి.

చందన్ :- అదంతా నాకు తెలుసు. అంతకంటే ఎక్కువ తెలుసుకోవాలని నాకోరిక. నాన్న ఎక్కడున్నాడమ్మా! నా చిన్నతనంలో చెబుతూండేదానివి : ఆయన ధనం సంపాదించేందుకు విదేశాలు వెళ్లాడని. మళ్ళీ ఎప్పుడొస్తాడు?

పన్నా :- ఏమి జవాబు చెప్పను నాయనా!

ఉదయుడు :- ఆయన విదేశాలు వెళ్ళారని ఇదివరకు మోస్తరుగా ఇప్పుడు చెప్పటంలేదు నీవు. వెళ్ళేటప్పుడు నీతో చెప్పి వెళ్లలేదా ఆయన?

పన్నా :- లేదు. భర్తృవియోగం నాకు ప్రాప్తించిన ఆనిశి ఇప్పటికీ - ఇంతకాలం గడచిన తర్వాతకూడా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా భయావహంగా ఉంటోంది.

ఉదయుడు :-అసలాయన ఎందుకు వెళ్ళాడో!

పన్నా :-దరిద్రతా దుఃఖ వికలుడై. అంతకంటే ఇంకేమి కారణం ఉంటుంది?

ఉదయుడు :-నీమీదా, చందన్ మీదా ప్రేమ త్రెంచేసుకునే?

పన్నా :-ఔను తండ్రీ! మా విషయికమైన చింత ఆయన కప్పుడు లేకనేపోయింది. భగవంతునిమీద విశ్వాసమే నశించింది ఆయన కప్పుడు. [కంఠంనుంచి ఒక తాయిత్తుతీసి] ఈ తాయిత్తు ఎప్పుడూ ఆయన కంఠాన చూస్తూండేదాన్ని. ఆయన మాతో చెప్పకుండా ఇల్లువిడిచిపోయిన రాత్రి తెల్లవారు ఝామున నాకిది ద్వారందగ్గర పడి ఉండగా దొరికింది. ఆయన మళ్లీ ఎప్పుడో తిరిగివస్తారనే ఆశతో దీన్ని నాటినుంచి ధరిస్తూవచ్చాను. ఇకనుంచి నీవు ధరించుకోరా చందన్! ఇది నీకు రక్షాకవచమూ గాక! [తాయిత్తు చందన్ మెడలో కడుతుంది]

చందన్ :-నేను దీన్ని ఎక్కడా పారేసుకోకుండా జాగ్రతగా ఉంచుకుంటా.

ఉదయుడు :-నీవు మరి తిరిగి మా కొలువులోకి ఎప్పుడొచ్చావు?

పన్నా :-నేనట్లా నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు నీ తండ్రిగారి దగ్గరకు వచ్చాను. ఆయనను నాపై దయగలిగి నన్ను పంచోళిగాని నాకు ఉప్పు పెట్టారు.

ఉదయుడు :-ఆయన నీ కెప్పుడైనా జ్ఞాపకం వస్తారా?

పన్నా :-జ్ఞాపకం రాదని ఎట్లా చెప్పను? కాని మీ ఉభయుల అధరపల్లవాలమీది హాసచంద్రికల్ని చూచి నప్పుడు నా అశ్రుబిందువులు ఇగిరిపోతవి.

చందన్ :-అయితే అమ్మా! నాన్నగారి సమాచారం ఏమీ తెలియడమే లేదా?

పన్నా :-నమ్మతగిన వార్తలేమీ రావటంలేదు. కొందరు దోపిడి దొంగల్లో చేరాడనీ, కొందరు బైరాగి అయిపోయాడనీ, మరి కొందరు......[కంఠావరోధం]

చందన్ :-వద్దమ్మా, ఆ మూడో మాట చెప్పనేవద్దు. అలా జరగదు, అది అబద్ధం. మా నాన్న ఎక్కడో దూరాన్నుంచి నన్ను పిలుస్తోన్నట్టుగా నా గుండెలో వినబడుతున్నది. 'రారా, చందన్!' అంటు న్నాడాయన. నే నాయన కంఠాన్ని కావలించుకుంటాను తప్పకుండా; ఎప్పుడో మాత్రం చెప్పలేను.

ఉదయుడు :-అమ్మా! ఇన్నాళ్లనుంచీ ఏమిటోమరి నా కర్థం కాకుండా ఉంది: మహారాణాకు, సర్దార్లకు మధ్య అంత విద్రోహం పెరిగిపోయిందేం? రాజసభ వ్యాపారాలు నియమితంగా జరగటమేలేదు. ప్రజ లెందుకో అంత అసంతృప్తిగా ఉన్నారు.

పన్నా :-దీని కంతకూ ఒక్కటే కారణవస్తువు. ఏమిటో అది సరిగ్గా అవగతం కావటంలేదు.

ఉదయుడు :-(తెరవేపు చూస్తూ) అదుగో మహారాణా ఇటే వస్తున్నారు. ఆయన్నే అడుగుదాం. జయము జయము చిత్తోడేశ్వరునికి.

(మహారాణా విక్రమసింహుడు ప్రవేశిస్తాడు.)

విక్రమ :-నన్నడిగి ప్రయోజనంలేదు ఉదయ్! నాకు మెడమీద తలే భారంగా తోస్తున్నది. ఈ తలపై చిత్తోడు రాజమకుటము ధరించటానికి యోగ్యతలేదు.

ఉదయుడు :-ఎంతమాటన్నారు మహారాణా!

విక్రమ :-నేను సత్యమే చెబుతున్నాను. ఉదయ్! విక్రమసింహుడు సుఖపడనీ, పడకపోనీ—చిత్తోడురాజ్యానికి మంగళ మవశ్యము కావలసినదే.

పన్నా :- మహారాణా! తమరెందుకో ఇవాళ చాల వ్యగ్రులై ఉన్నారు.

విక్రమ :- అందుకు నీవేమీ విచారపడకు పన్నా; సర్దార్లు నన్ను సింహాసనభ్రష్టుని చేయాలని నిశ్చయించారు. నేను వారికన్న ముందే ఈ చిత్తోడు రాజ్యమకుటాన్ని నీకు ఒప్పజెప్పిపోయేందుకు వచ్చాను. (మకుటము చేతిలో పట్టుకుని) ఉదయ్! ఎంతకాలంవరకు నీ చిన్నారి మస్తకము ఈ మకుటధారణకు ఉపయుక్తముకాదో, అంతవరకూ పన్నా! ఈ మకుటరక్షణ భారంకూడా నీదే.

(మకుటము పన్నా కీయబోతాడు. క్రోధావేశంతో వనవీరుడు ప్రవేశిస్తాడు.)

రావోయి వనవీర్! ఈ సమయంలో నీవుకూడ ఇక్కడ ఉండటము ఆవశ్యకమే - కాని, అదేమిటి? మాట్లాడవేం? నీ కన్నుల్లో క్రోధారుణచ్ఛాయ కమ్మింది. చివరకు నీకూ నామీద కోపం——

వనవీర్ :- నోరుముయ్. విక్రమ్! నీ కపటస్నేహం బయలుపడక తప్పిందికాదు పాపం! ఎందుకొచ్చానో నీకు తెలియదేం?

విక్రమ :- నా రాజ్యంలోని యీ విద్రోహాగ్నిని ఉపశమింపచేయటానికి నీకేదైనా మంచి ఉపాయం చెప్పేందుకు వచ్చావనుకుంటున్నాను. నిజం.

వనవీర్ :- కాదు, కాదు. నా ప్రాణవాయువుల్తో ఆ ఊది దాన్ని గగనచుంబిని చేసేందుకు. శాంతికోసం కాదు, యుద్ధానికి వచ్చాను.

విక్రముడు :- యుద్ధానికా? మనిద్దరమూ ఒకేపక్షం కాదూ?

వనవీరుడు :- కాదు, మనిద్దరమూ ఒకరొకరికి శత్రువులం.

విక్రముడు :- నీ కంఠధ్వని భయావహంగా ఉంది. ఈ నీ రోషానికి ఆధారం! ఇంత తొందరలో ఈ విషమ భావ పరివర్తనకు కారణం?

వనవీరుడు :- గుండెమీద చెయివేసుకుని నిన్నే ప్రశ్నించుకో. నిన్నిప్పుడు వధించటానికే వచ్చానని నేను చెప్పుకోవటం న్యాయకర్ణములకు అపశ్రుతిగా వినిపించదు.

పన్నా :- ఎమిటీ గొడవంతా? వనవీర్! ఎందుకంత ప్రబలంగాఉంది నీ హింసాభావమీనాడు?

వనవీరుడు :- ఏం, జవాబుచెప్పవేం? విక్రమ్! నేను నీ మార్గంలో ప్రబలకంటకంగా ఉన్నాను; నీవొక హంతకుణ్ణి పంపావు; వాడు నన్ను చంపలేకపోయాడు.

విక్రముడు :- నేను నీ హత్యకోరి హంతకుణ్ణి పంపానా? ఎంత అద్భుత సత్యం! అందుకు సాక్ష్యం?

(రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణజిత్తు :- నేనూ. విఫలప్రయత్నుడై ఆ హంతకుడు పారిపోతోంటే ఈ కన్నులతో చూచాను.

విక్రముడు :- హంతకుడు విఫలప్రయత్నుడయినందుకు సంతోషం. కాని వాణ్ణి నేను పంపానా? ఎవరుచెప్పారీ అబద్ధం?

రణజిత్తు :- అనుమానమూ, తర్కమూ చెబుతున్నై. లేకపోతే అన్నిసంగతులూ ప్రత్యక్షంగా ఎక్కడ చూడ గలుగుతాం ఎవరమైనా?

విక్రముడు :- రణజిత్! మొన్నటివరకూ నాకు వంతపాట పాడుతూండేవాడివి, నిన్నుకూడా ద్రోహచింతలే ఆవేశించినవీ? లేక మీరిద్దరూ ముందుగా ఆలోచించుకువచ్చి ఈవిధంగా పరిహాసమాడుతున్నారా? చాలు, చాలు. ఈ అసహ్యపీడ చాలవరకు తెచ్చారు.

రణజిత్తు :- చావడమా, బ్రతకడమా అన్న సమస్య ముందుంచుకుని ఎవరు పరిహాసమాడతారు?

వనవీరుడు :-నీదెబ్బ తప్పించుకున్నమీదట, ఇప్పుడు నేను పట్టవలసినది డాలా? కరవాలమా? ఏం జవాబు చెబుతావు?

ఉదయుడు :-అమ్మా! ఏమిటిదంతాను? చిత్తోడు మహారాణాకూడా ఇట్లు సంబోధింపబడుతున్నాడేమిటి?

విక్రముడు :-ఇదంతా ఎవరికుట్రో ఏమీ అర్థంకావటం లేదు. నిన్నెవరు నాపట్ల ఇంత విముఖుణ్ణి చేశారు? వనవీర్! నేను జీవితాశే వదులుకుంటున్నాను. నేను నీ హత్యకోరి హంతకుణ్ణి పంపించినట్టు అనుమానించి, నీవిప్పుడు నన్ను వధించటానికేవస్తే—జ్ఞాపకముంచుకో సత్యమనేది పృధ్వీగర్భాన్ని పటాపంచలు చేసుకొని ఏనాటికైనా ప్రకటనమౌతుంది. చిత్తోడు రాజ్యమకుటము కోసమే ఇంత చేస్తున్నావంటే నాకు పశ్చాత్తాపమే ఉండదు. ఇదిగో, అది ఇక్కడే ఉంది; తీసుకో.

(మకుటాన్ని ఇస్తాడు)

వనవీరుడు : (మకుటం తీసుకుని) ఇటుతే. దీన్ని రక్షించటానికి నేనే బాధ్యుణ్ణి. సైనికులు! విక్రముని బంధించండి.

(నలుగురు సైనికులు ప్రవేశిస్తారు)

పన్నా :-(ఒరనుంచి కత్తిపెరికి) ఏమిటిది? వనవీర్! జాగ్రత! నేను దాసిని మాత్రమే కాదు; రాజపుత్ర స్త్రీనికూడా. నా బొందిలో ప్రాణమున్నంతకాలము మహారాణాను ఎవరూ బంధించలేరు. (విక్రముని రక్షింపబోతుంది)

వనవీరుడు : (సైనికులతో) ఏమిటి చూస్తున్నారు? బంధించరేం? మహారాణాను నేను.

పన్నా :-(సైనికుల్ని లక్షించి) జాగ్రత! అడుగు ముందుకు వేశారంటే, మృత్యువు మూడిందే అనుకోండి.

(నల్గురు సర్దార్లతో కర్మచందు ప్రవేశిస్తాడు)

కర్మచంద్ :-(పన్నా చేతిలోనించి కత్తి తీసుకుంటాడు. అయన్నుచూచి పన్నా ఆదరం చూపుతూ నిల్చి ఉంటుంది.) శాంతించు పన్నా! ప్రజలకోరిక ఇలాగే ఉంది. ఇదే పరమేశ్వరుడి ఆదేశముకూడాను. నీ స్వార్థము మరచిపో. (సైనికులవేపు తిరిగి) బంధించండి!

విక్రముడు :-ఔను—ఔను. బంధించండి!

(విక్రముడు బందీ ఔతాడు)

కర్మచందు :-ఉదయ్! ఇటురా!

వనవీరుడు :-ఇదిగో, ఈ రాజమకుటము నీది. నీవు పెద్దవాడివయ్యేవరకూ దీన్ని నేను కాపాడుతాను.

(ఉదయుని మస్తకంమీద రాజమకుటం ఉంచుతాడు.)

ఉదయుడు :-(మకుటముతీసి క్రిందపెట్టి) వద్దు. వద్దు. ఈ విధంగా లభించిన ఇది బరువుగా కనిపిస్తోంది. భరించలేను.

(శీతలసేని ప్రవేశిస్తుంది)

శీతలసేని :-ఎవరు? మహారాణా విక్రమసింహుడు! ఇది నారి అవమానమునకు ప్రతీకారమా?

స్థిర దృశ్యం. తెరపడును.

(ఇంకా వుంది.)

# వింత వింతల ప్రపంచం

కెలేనుంచి డోవరువరకు యింగ్లీషుఛానల్ క్రిందనుంచి సుమారు 30 మైళ్ల పొడుగున ఒక సొరంగము దొలుచుటకు ఆలోచనజరిగింది. కాని 1883లో ఆస్కీము పార్లమెంటు నిరాకరించింది. తిరిగి 1930లో ఆ స్కీము అమలులో పెట్టడానికి ప్రయత్నించారు. కాని 35 మిలియనుల పౌనులుపైగా ఖర్చు పెట్టవలసి వుంటుందనిన్ని, యుద్ధ సమయములలో అపాయము యెక్కువగా వుంటుందనిన్ని ఆలోచించి పార్లమెంటువారు ఆ బిల్లును తిరిగి నిరాకరించారు. ప్రపంచంలో యిదివరకు యెక్కడాలేనంత పొడుగున ఆ టన్నెలువుండేది. ఆ యింజనీరింగుపని ప్రపంచములోని వింతలలోవకటిగా వుండేది. ఆ సొరంగములో నుంచి లండన్, పారిస్‌లమధ్య ప్రయాణము యెలక్ట్రిక్ ట్రెయిన్‌మీద ముప్పావుగంట మాత్రమే పడుతుంది. అందువల్ల రెండుగంటలకాలము కలిసివస్తుంది. కాని ఇది జరిగిన గాదు.

♦ ♦ ♦ ♦

బలవంతుడగు అగస్టస్ అను పోలెండురాజునకుగల అనేకమంది భార్యలకు 350 మంది పిల్లలు పుట్టేరు. రోడ్‌ద్వీపముమీద కాపురముండే ఒక కెనడాదేశస్థునకు తన ముగ్గురు ధర్మపత్నులవల్ల 41 మంది పిల్లలు పుట్టేరు. అందులో మొదటిభార్య వరుసగా కవలపిల్లలనుకన్నది. మూడవభార్యకు మూడుమార్లు ఒక్కొక్కసారి ముగ్గురేసి పిల్లలచొప్పున జన్మించారు. అందులో 36 గురు నిలిచారు. కెనడాలో సాధారణంగా ఒక కుటుంబానికి 8 లగాయతు 10వరకు పిల్లలుంటారు. 18మంది పిల్లలుండడం అసామాన్యంకాదు. ఒక్కొక్కప్పుడు ఒకేతల్లికి 25 మందిపైగానే పుట్టడంకూడాకలదు.

♦ ♦ ♦ ♦

ఐర్లండు స్వతంత్రపోరాటంలో 1920వ సం॥రంలో మాక్స్వినీ అనే ఆయనకునకు 2 సంవత్సరములు ఖైదువిధించగా అతను నిరశనవ్రతం 75 రోజులు సాగించి చివరరోజున చనిపోయాడు. 1933 లో మహాత్మాగాంధిగారు మూడువారములు ఉపవసించి మృత్యుదేవతను గెలిచారు. ఏసుక్రీస్తు 40 అహోరాత్రములు ఉపవసించినట్టు బైబిలు చెబుతోంది.

♦ ♦ ♦ ♦

మానవశరీరములోని ధమనికలు, సిరలు విడదీసి ఒకదానిచివర ఒకటి వరుసగా పొడుగుగాపెట్టినట్లైతే 3,50,000000 మైళ్ళ పొడుగవుతుంది. అనగా భూమియొక్క చుట్టుకొలతకు 14రెట్లు వుంటుందన్నమాట.

♦ ♦ ♦ ♦

చెమటపోవుటకు మనుష్యుని చర్మములో 2000000 రంధ్రములుంటాయి. అంటే సగటున చదరపు అంగుళమునకు 500 వుంటాయి. కాని అరికాళ్ళలోను అరిచేతులలోను 4రెట్లు అనగా చదరపు అంగుళమునకు 2000 వుంటాయి.

—వారణాశి భాస్కర మహాలక్ష్మి.

# ★ స్త్రీలు-కవిత్వము ★

కళామయమగు స్త్రీకి కవిత్వము కాణాచి

●

శ్రీమతి వేదవల్లి తాయారమ్మ

●

లలిత కళామయమగు స్త్రీ హృదయము నుండి వెలువడు కవితకు గాఠిన్యము కావలెనననను గాన్పింపదు. అట్టియెడ మృదుమధుర లలిత భావసమన్వితమైన కవితలనల్లి, జాతికి వెలుగు వెన్నెలల గూర్ప మహిళాలోక మేల ప్రయత్నింపదు ?

"ప్రకృతిః కర్త్రీ పురుషస్తు పుష్కరపలాశవన్నిర్లేపః" అని సృష్టిలో స్త్రీకి ప్రధానస్థాన మిచ్చినది. స్త్రీ వ్యక్తియన నొకదేవతా స్వరూపిణి. సర్వశక్తి సంపన్న. సృష్ట్యాదినుండియుఁ ద్రిమూర్తులుగూడఁ దమ స్త్రీలకుఁ దమ శరీరములందే యగ్రస్థానములనిచ్చి కృతార్థులైరి. మాతృదేవతయను నుడి గూడ నిచటే చెల్లినది. పాలఁబోసిన శాంతిమూర్తి. కరుడుగట్టిన ప్రేమమయి. విసువులేని సహనశీల. లేనిచో బిడ్డలవలన గలుగు బాధలను సైరింప నేరికిఁ దరమగును! స్త్రీ హృదయ మంతటి కోమలముగాననే పరుషవాక్కులఁ బలుక వెఱచు. ఎందునుగూడఁ బురుషులకుఁ దీసిపోని శక్తులు వారికిఁగలవు. స్త్రీలు సర్వశక్తి సంపన్నలుగాననే గరిటెపట్టిన చేతనే కత్తిపట్టి కదనరంగమునకురికి వీరత్వముజూపి వీరాంగనలైరి. పరహృదయభేదకముగా రాజ్యచక్రములఁ ద్రిప్పిరి. విద్వత్సభలయందుఁ బండిత వరులతో వాదములుసల్పి ప్రఖ్యాతినందిరి—

లలితకళలందు స్త్రీలకుఁగల నేర్పు వెన్నతోఁబెట్టినది. ఏ నికేతనములందు నే పాఠశాలలందును నేర్చికొనకయే గృహిణులు వన్నెవన్నెల ముగ్గులతోను, రంగులతోను వివిధములగు పూల మొక్కలతోను గృహముల నలంకరించి చూపఱకు కన్నులపండువు గావింతురు. జంత్రగాత్రములచే రాల్గరగింపఁజాలు గానకళవారి సొమ్ము; గానమునకు వన్నెతెచ్చు మాధుర్యము నెచ్చటను గొనితేఁబనిలేదు. "కలదుగదా సుధారసము కంజదళాక్షుల ముద్దుపల్కులన్" అనునపుడు గానమునందుఁ గరవగునా! స్త్రీ రోదన మొనర్చినను నేదేనొక రాగమాలపించినట్లేయుండునఁట! "ఆరాజీవాననయేడ్చె కిన్నరవధూ రాజత్కరాంభోజ కాంభోజీమేళవి పంచికారవసుధా పూరంబుతోరంబుగన్" అని గదా కవులవర్ణన. స్త్రీలు చిత్రగానకళలందే గాక కవితాకళయందుఁగూడ నెందును దీసిపోరు.

కవితయనఁ బాండిత్యముచే నలవడునదిగాదు. మనుజునకు జన్మాంతరవాసనా విశేషముచే లభించు నొక మహాఫలము. రవిగానని పదార్థములనుగూడ కవి తన సునిశితమగు దృష్టిచేఁ గనుఁగొని పాఠకులయెదుటఁ బెట్టును. దాననే కవిని "క్రాంతదర్శి"యనిరి. ఎన్నియుగములు గడచినను కవి యశఃకాంతులు కనుమఱుఁగు గానేరవు. ప్రాచీనచరితను బదిలపఱచు రత్నపేటికయనఁదగు వాఙ్మయమునకు సృష్టికర్త కవియే. రాజాధిరాజులనుగూడ ధిక్కరించుశక్తి కవివాక్కునకుఁగలదు. లేనిచో "ఇమ్మనుజేశ్వరాధము"లని పల్కుటకుఁ బోతనకు సాధ్యమగునా! కాననే భర్తృహరి "సుకవితా యద్యస్తి రాజ్యేనకి"మ్మని సకల సంపద్విలసితమగు సామ్రాజ్యమును దృణప్రాయముగా నిరసించెను. ఇట్టి కవుల ధనమగు కవిత పలుపోకలతో స్త్రీ పురుష వ్యక్తి భేదములేకనే యలవడుచుండును. అందును స్త్రీలకు సహజ పాండిత్యముగూడ నుండునని యొకకవి వ్రాసెను.

కవిత "పాసంగముత్తెఁపుసరుల్ పోహళించినలీలఁ దమలోనఁదొరయు శబ్దములఁగూర్చి" చెప్పవలెననియు, సుకవి పలుకులు "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము" గలిగినట్లుండుననియుఁ గవులు తమ నేర్పు కొలఁది చెప్పి పాఠకుల మన్ననలనందిరి. స్త్రీల కవితయందుఁగూడ నీ చెప్పిన లక్షణములెందును గొఱవడవు. లలితకళామయమగు స్త్రీ హృదయమునుండి వెలువడు కవితకుఁ గాఠిన్యము కావలెననినను గాన్పింపదు. ఇందులకొక చిన్నకథ చెప్పెదరు—'ఒకప్పుడొక యన్నయుఁ జెల్లెలుకలిసి యొకచోటునకుఁ బోవుచుండఁగా, దారిలో వారికొక యెండిన వృక్షము గాన్పించెను. దానినిజూచి సోదరుఁడు "శుష్కోవృక్ష స్తిష్ఠత్యగ్రే" అని పల్కెను. ఆ భావముతోనే సోదరి "నీరస తరురిహానివసతిపురతః" అని పలికెను.' దీనినిఁబట్టి చూడ స్త్రీల వాక్కునందెంత సహజమగు సౌకుమార్యముండునో తెలియఁగలదు.

ప్రాచీన కాలమునుండియు స్త్రీలలో విదుషీమణులు కవయిత్రులు లేకపోలేదు. వేదకాలమున వేదములలోని కొన్ని ఋక్కులనుగూడ రచించినవారున్నారు. తరువాతి కాలమున సుప్రసిద్ధ రచయితలగు పళని, మొల్ల, వెంకమాంబ మున్నగు మహిళామణులున్నారు. వాఙ్మయము చాలవఱకు యక్షగానములు పాటల రూపముననున్న కాలమున విద్యాగంధములేని కాంతలుగూడ "లంకాయాగము", "కుశలవకథ", "కృష్ణలీలలు" మున్నగుపాటలను నేర్చుకొని మరపులేకుండ నుండెడివారు. వీరలకుగల ధారణాశక్తి యత్యద్భుతము. ఎప్పుడోయననేల? నేటికిని శ్రీ సరోజినీదేవికవితను గొనియాడని యాంగ్లభాషా కోవిదులుండరు. వంశములోనున్నచో నెప్పటికైన వచ్చుననునట్లు స్త్రీ జాతియందే యీ కళ కాణాచిగానున్నదనుచుండనది యెట్లులభింపకుండును? పెద్దలు ముద్దార నేర్పించినయెడల ముదితలు నేరఁగరాని విద్యయుండదు. వేయేల? ఈ మన గృహలక్ష్మి యారంభమునకంటె నిపుడెంత పెంపొదినది! ఎందఱు గృహలక్ష్ముల వ్యాసరాజములచే వన్నెకెక్కుచున్నది! ఎందఱు చిత్రకారిణుల చిత్రములచే చిత్రింపఁ బడుచున్నది! కాన స్త్రీలకుఁదగిన యవకాశము గల్పించినచో విద్యావిషయమునందేగాక కవితాకళయందుఁగూడ నగ్రస్థానము నందఁగలరనుటకు సందియములేదు.

## విజయ శంఖము 

మధునాపంతుల వేంకట సూర్యనారాయణమూర్తి

యువకరక్తము ఉడుకుటలేదా?
రక్తజ్వాలలు వెలుగుటలేదా?
ఆంధ్రత్వము అణగిపోయెనా?
ఏలనో ఈ ఆలస్యం?—

జయభేరిని మ్రోగించండి
ఎంతకాలం ఈ అంధత్వం
ఎంతకాలం ఈ బానిసశృంఖులు
పటపట త్రెంపలేవా?
స్వేచ్ఛవిహారాల్ సలుపగలేవా?
స్వేచ్ఛాజీవిక జరుపగలేవా?
త్రెంపివేయుడు దాస్యశృంఖలను
ఏల ఈ ఆలస్యం!—

రమ్యాజనం రమ్యవిహారాలు
సలుపుటలేదా! సాధించండి!
ఉరకండి పైపైకి ఉరకండి?
ఏలనో ఈఆలస్యం!—

అస్వాతంత్ర్యపు ఆగడమ్ములు
అస్వాతంత్ర్యపు ఆచరితమ్ములు
అస్వాతంత్రపు అహంభావములు
ఆక్షరించుటలేదా?
ఆంధ్రవిజయము!
ఆచరింపుడు!
'ఆంధ్ర' శంఖము
పూరించండి!—

# గౌతమి

● శ్రీ పాలకోడేటి శ్రీరామశర్మ బి. ఏ.



'అమ్మా! యింతరాత్రివేళ నీదగ్గర కెందుకొచ్చానంటావేమో! యిక్కడికి యిప్పుడు నేను వంటరిగా రావడం, ప్రజలకీ, లోకానికీ విడ్డూరంగా, తప్పుగా కనిపిస్తే కనిపించవచ్చుకాని నాకూ నామనస్సుకీ మాత్రం అదితప్పుకాక ఒప్పుగానే కనిపిస్తూంది. నన్ను నీ కడుపులో పెట్టుకుని కాపాడాలి. వాళ్లు_వాళ్లుందే_ నన్ను చాలా బాధపెట్టేరు_హింసిస్తున్నారు_యింకా - యింకా కాల్చుకుతింటారు. నువ్వు ఒక్కర్తవే నా బాధల్ని నివారణచేస్తావని వచ్చేను. తల్లీ! నిజమే! ప్రపంచానికి యీలోకానికి నాబాధ, నా మనస్సులోని అగ్నిజ్వాలలు యేంతెలుస్తాయి? నా కథంతా చెప్పమంటావా? అలానే చెప్తానమ్మా! నా గోడువింటాననేవారే లేరు. అయితే విను.'

♦ ♦ ♦ ♦

'యీ లోకపుటీర్ష్యా నేత్రాలు నాపై ప్రసరించకముందే యీ సంఘ దౌర్జన్యం, సంఘంలో ఉండే కుళ్లూ తెలుసుకోడానికి తగినఅవకాశము కలుగకముందే, నాచదువు చట్టుబండలుచేసి, పెళ్లంటే యేమిటో తెలీకమునుపే నాకు పెళ్లిచేశారు మావాళ్లంతాను. సరి కొన్నాళ్లకి పంపించమని ఉత్తరం. నేనింకా అత్తారింటిలో అడుగుపెట్టేనో లేదో, ప్రారంభం రణగొణధ్వని. యింతాదేనికి? నేను పట్నవాసంలో పెరిగేనుట, కొంతవరకూ చదువుకొన్నానుట. అసలుకారణం మావాళ్లు పెళ్లిలో యిస్తానన్న కట్నం అయిదువేలూ-ఆ సమయానికి కొద్దిగా సొమ్ము తక్కువవటంచేత ఓ వెయ్యిరూపాయిలు బాకీపెట్టి తరవాత యిస్తానన్నారు- అదీ కొంపమునిగింది. ఆ కారణంచేత నామీద విరుచుకుపడ్డారు వాళ్లంతా. రోజు అయిందానికీ కానిదానికీ రామ రావణయుద్ధం. అబ్బ! వారుఅనే ఒక్కొక్కమాట నా హృదయంలో గునపాల్లా గుచ్చుకున్నాయి_ నేనేం ఆయన్ని పాడవమన్నానా? తనకిబుద్ధిలేక తనుపతితుడై- పాడై నన్ను అధోగతిపాలు చేసిందికాక నా మూలాన్నే పాపం ఆయన పాడయ్యేట్ట. అబ్బ! అమ్మా! యీమాటలికపడలేను. సరే, పోనీనాకర్మం యిలా కాలింది అంచేత అంటారని సహించేను. ఎంతైనా ఆయన 'భర్త'కదాఅని ఆయనకి కావలసిన పనులన్నీ చేసేదాన్ని. మంచంమీంచి లేవగలుగుతే కదూ! కొంతకాలం బాధచేతో మరెందుచేతో ఆయనకూడా మాటికీ చీటికీ నామీద రొస రొసలాడేవారు. భగవంతుడా! యే జన్మలో చేసుకున్న పాపమో యిప్పుడు అనుభవించక తప్పుతుందా అని నా పూర్వజన్మ కర్మని తలుచుకుంటూ నాలో నేనే కుళ్లేదాన్ని. పోనీ మనసుకి కొంతశాంతి కలుగుతుందికదా అని ఏదేనాపుస్తకం చదువుకుంటే అప్పుడే ప్రారంభం 'ఓ! దీనికే చదువువచ్చు మరెవళ్లకీ యింతోటి చదువురానట్టు. ఏం పుణ్యమా పురుషార్థమా? ఎంతసేపు ఏదోపత్రికలూ, పేపర్లూ అవే కదూ? బూతులబుంగలు. అవి చదవడం. వాటిలో మళ్లే సంచరించడం. అవన్నీ చదివి నాకొడుక్కి యేమందో మా కొంపెట్టి'_అబ్బ చెప్పడానికి కష్టంగా ఉందమ్మా 'చంపేసి, మరో మొగుడితో లేచిపోదామని చూస్తోందట్లో_' అబ్బ ఆ ముక్కలన్నీ ఒక్కొక్కమాట ఒక్కొక్కగాయంచేసేయి యీ హృదయమ్మీద. భారత స్త్రీ హృదయం అంతముక్కిపోలేదని తెలుసుకోలేదు. భారతస్త్రీ యింకా అంతనీచంగా ప్రవర్తించడానికి సమకట్టలేదని తెలుసుకోలేక పోయారు పాపం.

పోనీ మావాళ్లెవళ్లేనా నాలుగురోజులు తీసుకెళ్తామంటే పంపరు. మా అన్నయ్య నామీద చాలా దయగా ఉండేవాడు. నా దుస్థితిచూసి గుండె పగిలేటట్టు ఏడ్చేవాడు. అతను నాలుగురోజులపాటు పంప

మన్నాడు. వారికి పెళ్లినాడిస్తానన్న కట్నంమాట తేల్చమన్నారు. అయినదంతా అయిపోగా అతనికి ముప్పై రూపాయిల ఉద్యోగం మిగిలింది. అతనేంవిటిస్తాడమ్మా! ఆధనంకోసమా నన్ను బాధలు పెట్టడం. పోనీ చదువుకున్నారుకదా వారికేనా ఆ జ్ఞానం ఉండకూడదూ?

నాభాధలుచూచి సహించలేక వాళ్లతో దెబ్బలాడి నన్ను తనయింటికి తీసుకొచ్చాడు. కొన్నాళ్లు గడచిపోయాయి. ఓ రోజున మాఅన్నయ్య ఏమనుకున్నాడో నాదగ్గిరకొచ్చి మెల్లగా 'అమ్మా నేనో మాటంటాను కోపంరాదుగద? ఆముక్క అనకూడదుకాని నీ కష్టాలు మరి చూడలేకుండా ఉన్నాను తల్లీ. నీకు పెళ్లయిందగ్గరనుంచీ ఓముచ్చటేనా యెరుగుదువూ? కంటినిండా నిద్ర కడుపునిండా భోజనంఉందీ? ఎప్పుడూదుఃఖం తప్ప. అతనుందే అభాజనుడు. ఎవరికీపనికిరాడు. మంచంమీంచి లేవలేని పాట్లపండు. అతను నీకు మూడుముళ్లూ వేసాడుకాబట్టి పేరుకిభర్తకాని అతనివల్ల ఒకరోజేనా సుఖమెరుగుదువూ? పైపెచ్చు కష్టాలుతప్ప_అంచేత_అమ్మా! అంచేత ఆభర్తను_వదిలేసి...' 'నీవేనా మాట్లాడుతున్నది. ఆయన్ని వదిలేసి మళ్లీపెళ్లి చేసుకొమ్మంటావా?' 'మ_ళ్లీ_పె_ళ్లి' అతనిగొంతు కంపించిపోయింది. నేత్రాల్లో అరుణజ్వాల ప్రజ్వలించింది. 'అవునమ్మా! మళ్లీపెళ్లి_ఏంతప్పా? మనధర్మ శాస్త్రాలలోనేఉంది. భార్య కాని, భర్తకాని ఏ ఒకరైనా కుదరదని, నిర్ధారణపడి ఏదీర్ఘవ్యాధిచే బాధపడుతూన్నా ఒకర్ని వకరు ఐదేళ్లలో ఒకమారేనా చూసుకోకపోయినా, ఉత్తరప్రత్యుత్తరాలు లేకపోయినా, వారు ఆడదైనా మగాడైనా. విడాకులిచ్చి మళ్లీపెళ్లి చేసుకోవచ్చు' అని. 'అన్నయ్యా! నువ్వేనా మాట్లాడుతున్నది? భారత స్త్రీ యెంతకాలం భారత స్త్రీయో అంతకాలం అలాటిపని జరగనేరదు. భారతనారి అంత యెంగిలి మంగలం మాత్రం కాజాలదు. అంచేతనే మనభారతదేశం అన్నిదేశాలకీ తలమానికంలాఉంది. మళ్లీపెళ్లిఅని అనేశావే కాని, దాన్లోఉండే కష్టసుఖాలు గుర్తించావా? బాగాఆలోచించు. సంఘం నిన్నూ, నన్నూ బతకనిస్తుందా? యీ సనాతనులంతా విచ్చుకత్తులు నూరరూ! నిన్నూ నన్నూ నీకుపుట్టబోయే పిల్లల్ని అందర్నీ వెలివేస్తుంది సంఘం. నిలవడానికినీడా తాగడానికినీళ్లూ పుట్టకుండా చెయ్యగలదీ మానవసంఘం' 'పోనీ నీ సౌఖ్యమే నాకుకావాలి. యీ సంఘాన్ని, మానవలోకాన్ని లక్ష్యపెట్టేవాడెవడు?' 'అన్నయ్యా! ఉత్తివెట్టితనం. లాభంలేదు. మనంయెదిరించలేం. యెందుకుకష్టపడతావు. అయినప్పటికీ యింకానారీలోకం అంతపతనావస్థకు రాలేదు. భారతస్త్రీలు మృగాలకన్నా కనాకష్టంగా అయేహీనావస్థకురాలేదు. నాప్రాణమేనా పోవడానికి సిద్ధపడతాను కాని అలాటిపనిమాత్రం చెయ్యలేను; క్షమించు. నామీదనీకున్న ప్రేమకి ధన్యవాదాలు' అన్నాను. మాఅన్నయ్య మరిమాట యెత్తలేదు.

అమ్మా! అంతటితోనా కష్టాలు గట్టెక్కుతేనా? వాళ్లని కాదని నన్ను మాఅన్నయ్య తీసుకొచ్చేట్ట. అంచేత వాళ్లగడప మరి యెక్కొద్దన్నారు. అసలుసంగతి కట్నంసొమ్ము. మా అన్నయ్యకి బోధపరచి యెన్నోఉత్తరాలు రాయించేను. కాని వాళ్లుపట్టువదుత్తేనా? 'అమ్మా! పోనీ నీకష్టాలు గట్టెక్కాయి. పీడవదిలింది, నాకోఅన్నదమ్ముడివి అనుకుంటాను. నాతోపాటే కలోగంజో నువ్వూ తాగుదుగాని. నీ ఒక్క పొట్టబరువైపోయిందా తల్లీ! చదువుకుంటే చదువుచెప్పిస్తా' నన్నాడు. అడుగంటిన ఆశాలత చిగిర్చింది. పోనీ ప్రపంచంలో యే సుఖంలేకపోయినా, నాజీవితంలో యీ పాటేనా దీపం వెలగబోతూన్నందుకు సంతోషించాను. నామనస్సుని రాయచేసుకున్నాను. నన్నుస్కూలికి పంపేడు అన్నయ్య.

ఓ సంవత్సరం గడిచింది. ఓరోజున మా వదిన ఏమో అన్నయ్యతో మాట్లాడుతూంది. అన్నయ్య గొంతు గద్గదికమై పోయింది. 'నువ్వుయెన్ని చెప్పినా ఆమాటలునమ్మను. అదిఅలాటిదికాదు_దానిహృదయం

నీకు తెలీదు_అలాటిదే అయితే, నేను పెళ్లిచేస్తానంటే వద్దని యిలాంటి పనికిలోబడుతుందా ?' అన్నాడు. నాగుండె ఝల్లుమంది. 'నేనుమాత్రం చూశానా_లోకులు కాకులన్నారు. లోకాన్ని ముయ్యడం మన వశమా ? మొగుడ్ని వదిలేసి, చదువుకుంటూంది_అది_అచ్చి_యింకా ఏమేమో గుసగుసలు ప్రారంభమయ్యాయి. మీరింకతలెత్తుకుని తిరగ్గలరూ ?_మనపరువుమర్యాదలు దక్కుతాయీ !' 'లోకంగుడ్డిది, దానికి చెవులేకాని కళ్లులేవు. అబ్బా ! అమాయకురాల్ని యెంతకష్టపెడుతూంది గుడ్డిప్రపంచం, నేనునమ్మలేను.' మరినేను వినలేకపోయాను. కళ్లుచీకట్లుకమ్మాయి. లోకం_పాడులోకం_పాపం నానుంచి మాఅన్నయ్యకి పరువుమర్యాదలుండవు. అబ్బా ! నాకర్మం యిలాఉంటే యెవరుతప్పిస్తారు. అమ్మా_యింక_తల్లీ ! గౌతమీ ! యింక యీకష్టాలు అనుభవించలేను. నానుంచి యెవరి పరువుమర్యాదలూ పోనక్కరలేదు. నీచల్లని కడుపులో చోటియ్యి. నాకదేపదివేలు. యింక యీ అభాగినికి నీ కంటెదిక్కులేదు. శాశ్వతానందం యియ్యి ! తల్లీ నన్ను నీలోకలుపుకో !_యివేనాతుదివందనాలు'

## ఆంధ్రశిల్పి

తొలచినాఁడవు గండశిలలనే ఒకనూత్న శిల్ప సౌందర్యంబు చిందులాడ
మలచినాఁడవు చేవఱ్ఱాఁకులనే శిల్ప శృంగార రసధునుల్ పొంగిపారల
కల్పించినాఁడవు కఠినలోహములనే లలితకలాశోభ మొలుకు లీల
చిత్రించినాఁడవు చీకు మృత్తికలనే జీవనజ్యోతులు జెలఁగుచుండ

ఆ మహాకలాకాంతినే భూమిలోన
వెలుఁగఁజేసితివో నేఁడు తెలియరాదు
కవిని, నాకైన వచియింపు కలనునైన;
గాన మొనరింతు నీకళా గాథలెపుడు.

నీ మహోజ్జ్వలశిల్ప నిపుణత్వమున, నజంతాగుహా సీమ రత్నాలు మెరసె
నీ సృష్టిప్రతిభచే నిస్తుల శిల్పమ్ము ఎల్లోరా కొండలో వెల్లివిరిసె
నీ కళాకౌశల శ్రీకారణమ్మున హంపి నిలింపాలయంబు నయ్యె
నీ కల్పనా శక్తిచే కళామృతరాశి అమరావతీ స్తూప మందుఁదనరె

ఆ మహోత్కృష్ట శిల్ప భాగ్యంబునరసి
భవ్య భవదీయ సద్యశో భావగీతి
పాడుచున్నది సతతంబు భారతాంబ
ఆంధ్రశిల్పి ! ధన్యాత్ముఁడవయ్య నీవు !.

—వారణాసి వేంకటేశ్వరులు



గతమాసములో నంద్యాలలో జరిగిన 14 వ ఆంధ్రరాష్ట్రీయ మహిళా మహాసభకు
ఆహ్వాన సంఘముగా ఏర్పడిన విదుషీమణులు



బొంబాయి మహిళామండలి, గుజరాతీ స్త్రీ మండలి వారి ఆధ్వర్యాన్ని, వనితా విశ్రామ మందిరంలో 'స్వదేశీ వస్త్రప్రదర్శనము' ఏర్పాటు చేయబడింది. ప్రదర్శనము శ్రీమతి రామారావు సతిగారిచే బహిరంగపరుపబడింది. చిత్రములో శ్రీమతి రామారావు సతిగారు కార్యదర్శినియైన శ్రీమతి జయశ్రీ రాయ్‌జిగారితో ప్రదర్శితములైన వస్తువులను గురించి చర్చించుట కానవగును.

తాడేపల్లిగూడెం సతీహితసమితి శారదాగ్రంథాలయం అష్టమ వార్షికోత్సవం గతమాసంలో జరిగింది. శ్రీమతి చుండూరు రత్నమ్మగారు అధ్యక్షతవహించారు.



## కుమారి చిలుకోటి నాగరత్నం

"భక్త్యరుజయంతి విద్యార్థి వేతనము" సహాయంతో యీ సంవత్సరం రాజమండ్రి సెకండరీగ్రేడు ట్రెయినింగు (2వ సంవత్సరము) చదువుచున్న హరిజన విద్యార్థిని యీమె గతసంవత్సరము ఆంధ్రరాష్ట్ర హరిజనసేవక సంఘంవారిచే ఒసగబడిన "మూర్తి విద్యార్థి వేతనము" సహాయంతో మొదటి సంవత్సరము ట్రెయినింగులో కృతార్థురాలు అయింది.

కట్నాలు తెచ్చిపెట్టిన కొత్త అనర్థం—  ★ ★ ★

# విద్యావతులు అవివాహితలుగా మిగిలిపోతున్నారు

**వివాహానికి చదువుకున్న కన్యలు కావాలంటున్నారు .. ఆడపిల్లల చదువుకూ డబ్బు ఖర్చు ఎక్కువౌతూవుంది – వారి వివాహాలకు కట్నమూ ఎక్కువౌతూ వుంది – రెండువిధాలా కన్య తండ్రికి ఒత్తిడి ఎక్కువై నలిగిపోతూ వున్నాడు. కట్నాలు ఇవ్వలేకా, తాహతుకు తగినవరుడు దొరకకా విద్యావతులగు కన్యలు అవివాహితలుగా ఉండి పోతున్నారు. ఇందువల్ల అశాంతి ప్రబలమౌతూ వుంది. దీన్ని మనవారు గమనించారా ?**

శ్రీమతి కె. సరోజనీదేవి

ఈ కట్నం అనేరాక్షసి యింకా హిందూదేశాన్ని వదలలేదు. విద్యావికాసాలు అభివృద్ధిగాంచిన కొలదీ తగ్గిపోవలసిన యీకట్నంబాధ అంతకంతకు హెచ్చిపోతోంది. విద్యాధికులలోనే కట్నాలు హెచ్చు అయినాయి. దీనికికారణాలు, దానివలన సంఘంలో జరిగేమార్పు, దానివలన యితర నష్టాలూ మనం ఇంకా గ్రహించలేదు.

పూర్వం కట్నాలు ఒకలాంఛనం. పెండ్లి కుమార్తెతండ్రి ఏదో సంతోష పూర్వకంగా అల్లుడ్ని ఆశీర్వదించి యిచ్చినబహుమతి. ఇది చివరకు ఒక తప్పనిసరియైన పని అయింది. అదొకమర్యాద అయింది. "స్త్రీ విత్తం అధమాధమం" అని విధించిన హిందువులే ఈ కట్నాన్నికూడా తెచ్చిపెట్టారు. కట్నపిశాచం మనదేశంలో ఏకారణంవల్ల వస్తేనేంగాని ప్రస్తుతం అతి తీవ్రరూపాన్నిదాల్చి సంఘాల్ని అంత అలజడి చెయ్యగలిగిన కారణాలు పరిశీలించాలి.

ఆర్థికంగా కట్నాలుపుచ్చుకోవడం తప్పులేదు. తండ్రి ఆస్తి కొడుకులకూ, కూతుళ్లకు న్యాయానికి సమంగాపంచాలి. మన హిందూమతము స్త్రీకి అట్టిహక్కులేకుండగా చేసింది. ఏనాడైతే ఆర్థికంగా స్త్రీ పురుషునిమీద ఆధారపడవలసి వచ్చిందో ఆనాటినుండి స్త్రీ పురుషునకు దాసీఅయింది. తండ్రి తన బిడ్డను ఇంకొకరి ఇంటికి పంపించినప్పుడు ఆర్థికంగా తనబాధ్యత నంతా వదలించుకొంటున్నాడు. ఆపిల్లకు తన ఆస్తిమీద హక్కులేకుండా చేస్తున్నాడు. ఆ బాధ్యతవహించే పురుషుడు అట్టి తండ్రిమీద ఆర్థిక సహాయం విధించడం అట్టే తప్పులేదు.

మొత్తంమీద అది ఆ అమ్మాయికి బహుమతి అయిలేనేం, అబ్బాయికి బహుమతి అయిలేనేం ఏదైతేనేం - ఏకట్నం పుచ్చుకోకుండ బాగానేయుంటుంది కాని - ఆ పెద్దమనిషి ఇచ్చుకోగలుగునా లేదా అనే విషయం ఆలోచించాలి. ఇచ్చుకోగలవారి దగ్గరనుండి ఎంత పుచ్చుకొన్నా భయంలేదుకాని ఇచ్చుకోగలడా, లేడా అన్న విచక్షణలేకుండగా ఇవ్వవలసివస్తూంది కాబట్టే కట్నాన్ని పిశాచం అనవలసివస్తూంది.

పిల్లవాని తరఫునుంచిచూస్తే అతని ఆలోచన ఇలావుంటుంది. మంచి పిల్లకావాలి. చదువు, సాంప్రదాయం వుండాలి. ఆపైగా పెండ్లిఅంటే గొప్ప బాధ్యత, ఇంకొకరినిపోషించాలి. అందువలన ఒకానొకపిల్ల కట్నంతోటివస్తూంటే చాల బాగుంటుంది. అందులో మధ్యతరగతివాడైతే తను చదువుకున్న చదువుకు పెట్టినదానిలో కొంతభాగం అయినా కూడతీర్దామనుకుంటాడు. అందరూ చదువుకున్న అబ్బాయే కావాలంటారు. అందుకనే విద్యాధికులలోనే కట్నం హెచ్చు అయిపోయింది.

న్యాయానికిచూస్తే ఆడపిల్లకు కొడుకులతోకూడ ఆస్తివచ్చే పక్షం అయితే ఎంత వస్తుందో అంత కట్నం ఇచ్చే పెద్దమనిషి ఎవరూలేరు. దీన్నిబట్టిచూస్తే కట్నాలుహెచ్చు అనుట అన్యాయం. పైగా ఈ ఆడపిలలుగల తండ్రులు వారికి తగువారికియిచ్చేపక్షం అయితే కట్నాలతీవ్రత వుండనేవుండదు. అధికంగా తన కంటేమించినవాళ్ళ అబ్బాయికి తన అమ్మాయిని యిద్దామని ప్రతివాడూ చూస్తాడు. ఆ అబ్బాయికోసము అలాగే అనేకమంది చూస్తారు. అందుచేతకట్నం హెచ్చు అవుతోంది.

ఇటీవల మన సంఘంలోకలిగే గొప్పమార్పు ఒకటి మనవారు ఇంకా గ్రహించినట్లు కనుపించదు. స్త్రీవిద్య అభివృద్ధిగాంచుచున్నందువలన తండ్రులకు ఆపిల్లలవిద్యకయ్యేఖర్చు లెక్కువవుతాయి. చదువుకొంటే మంచి భర్తవస్తాడనే ఉద్దేశ్యముతో ఆడపిల్లలను ఎక్కువచదివిస్తున్నారు. అట్టి విద్యావతులగు పిల్లలకు ఎక్కువ విద్యావంతుడైన భర్తకావాలికదా అని ఆలాటివారు ఎక్కువకట్నం ఇవ్వనిదేకాని దొరకరు. కనుక చివరకు ఆడపిల్లలకు చదువుకూ ఎక్కువడబ్బు అయిపోతూవుంది; కట్నమూ ఎక్కువవుతూవుంది. మన సంఘంలో ఆడపిల్లలభారము తల్లితండ్రులకే ఎక్కువ. తగిన భర్తలభించకపోతే ఎక్కువకట్నం ఇయ్యగలిగినవారు వెంటనే తమ పిల్లలకు వివాహముచేస్తున్నారు. కట్నం ఇవ్వలేనివారు తమ పిల్లలను అలావుంచివేయడమో, చదువు చెప్పించడమో జరుగుతున్నది. అవివాహితలు, విద్యావంతులు అగుకన్యలు మన సంఘంలో మిగిలిపోతున్నారు.

ఇది చాల అనర్థదాయకమగు మార్పు. దీనివలనకలుగు ఫలితాలు ఒకసారి వంగదేశాన్నిచూస్తే తెలుస్తాయి. వంగదేశములో కట్నాలబాధ హెచ్చు. విద్యవంతులు, అవివాహితలు అగుకన్యలు ఎంతోమందివున్నారు. వీరికి ఆంగ్లవిద్యవలన, హైందవ సాంప్రదాయకమగు నీతి నియమములంటే నమ్మకము తగ్గుతూవుంది. పైగా వయసువచ్చినస్త్రీలు పురుషులతో తరచు తిరుగుచుండుటవలన చెప్పరాని అనర్థాల అనేకములు కలుగుతున్నాయి. 193౽లో సుజాత సర్కారు అను B. A. విద్యార్థినియొక్క బలవన్మరణము సంగతి అందరికీ తెలిసినవిషయమే. సుజాతా సర్కార్ అనుకన్య B. A. విద్యార్థిని. దుస్సాంగత్యము - గర్భవిచ్ఛిత్తి-చివరకు ప్రాణములు గోల్పోయింది. ఇటువంటివి అనేకముతరచు జరుగుతున్నాయనీ, విద్యావతులగు స్త్రీలు అవివాహితులైయుండి ఇట్లు చెడిపోవుటకు కారణము వరశుల్కబాధే అని 'అమృతబజారు' పత్రిక ముఖ్య సంపాదకీయం వ్రాసింది.

అటువంటి చెడ్డ పరిస్థితులు, ఇంకా మనసంఘానికి రాలేదుగాని, మనం ఇప్పుడే కండ్లు తెరవకపోతే మన బాలికలుకూడా పాడయిపోతారు. సంఘం పాడవుతుంది. నీతి నియమాలు పోతాయి. ఆదుర్దినం రాకుండా కాపాడేభారం విద్యావంతులగు పురుషులది. వారివిషయం గమనించి కట్నాలమీద మోజు తగ్గిస్తారా ?




# అన్నం ఎలా అరుగుతుంది?

డాక్టరు యస్. శేషగిరిరావుగారు

మీవూళ్లో ధాన్యం మరవుంది. దాన్ని మీరు చూచేవుంటారు. ఆ మర ధాన్యాన్నిదంచి బియ్యం చేస్తుంది. మరలో వడ్లుపోస్తే మర వాటినిదంచి పనికిరానివూకను వొకపక్కా, పనికివచ్చే బియ్యాన్ని యింకోపక్కా, తౌడును మరోపక్కా పోస్తుంది. కాని యిలాపనిచేసేమర ఊరకే పనిచేస్తుందా? చక్రాలు వున్నంతనే పనిచేస్తుందా? చేయదు. ఆమర పనిచేయడానికి రాక్షసిబొగ్గు, పెట్రోలు, కిరసనాయిలు యింకా యిటువంటివే యేవేవో కావాలి. అవన్నీ మరలోపోస్తే వాటిని వంటపట్టించుకుంటూ ఆమర ఝుయ్యిఝుయ్యిమంటూ ఆడుతూ పాడుతూ పనిచేస్తుంది.

మీవూళ్లోవున్న మరనే గుర్తించారుకాని మీలోనే, మీ ఒంట్లోనే ఓమరవుంది. అది గుర్తించారూ! నిజంగా ఆలోచిస్తే నేనూ ఓమర. మీరూ ఓమర! మరల చక్రాలూ పట్టాలూ తిరిగినట్టుగా మన శరీరంఅనే యంత్రంయొక్క కాళ్లూచేతులూ కదలాలి అంటే యంత్రాలకు చమురుపోసినట్టే మనం ఆహారం తీసుకోవాలి. ఆహారంతింటున్నాం; అది జీర్ణంచేసుకుని వంటపట్టించుకున్నాం. కనకనే మన ఆకలితీరి చేతులూ కాళ్లూ, కళ్లూ చెవులూ, మెదడు పనిచేస్తూ వున్నాయి.

మనశరీరం వృద్ధిపొందడమూ, మనం యెదగడమూ అంతాతిన్న ఆహారాన్ని జీర్ణించుకోవడం లోనే వుంది.

జీర్ణించుకోవడం అంటే యిదేమా అనుకుంటున్నారు కదూ! అదే చెపుతావినండి. మీరు స్కూలునుంచి యింటికివెళ్లి "అమ్మా ఆకలివేస్తోంది అన్నంపెట్టు" అంటారు. అమ్మ అన్నం పెడుతుంది. మీరు దాన్నితింటారు; ఆకలి తగ్గుతుంది. నీరసంగావున్నమీకు కొంచెం ఉత్సాహంకలుగుతుంది. తిన్నది జీర్ణం అయినమీదట అంతకుముందుకన్నా మీకు చెలాకీయెక్కువ ఔతుంది. మళ్లీ చెపుతున్నా - యిది అంతా మీరు తిన్నవస్తువులను జీర్ణంచేసుకోవడము మీద ఆధారపడి వుంటుంది.

ఇప్పుడు జీర్ణంచేసుకోవడము చాలా ముఖ్యమయిందని తెలుసుకున్నారు. యిక యీ ఆహారం యెలా జీర్ణానికివస్తుందో ఆసంగతిచెపుతా.

మనంతినే ఆహారంలో మాంసాన్నిపోషించే పదార్థాలువున్నయి. పనిచేయడంవల్ల శరీరానికికలిగే క్షీణతను ఆదుకునే కొవ్వు పదార్థాలూవున్నయి. యింకా లవణాలూ, శక్తీ, వేడీ యిచ్చే పిండిపదార్థాలూ

వున్నాయి. యిప్పుడుచెప్పానే ఆ పదార్థాలు అన్నీ మన శరీరయంత్రం పనిచేయడానికి అవసరం; అయితే యీ పదార్థాలు కొన్నింటిలో యెక్కువ కొన్నింటిలో తక్కువావుంటవి. కొన్నికొన్ని పదార్థాలు కొన్నింటిలో లేవనుకోనవలసినంత కొద్దిగా వుంటవి.

ఉదాహరణకు చెప్పుతా-మాంసం, గుడ్లు, గోధుమలు,చిక్కుళ్లు, బటానీలు, జొన్నలు యిటువంటి వాటిలో మన శరీరంలోని మాంస భాగాన్ని పోషించే పదార్థాలు వున్నవి. నెయ్యి, వెన్న, పాలూ, నూనె, చేపలు యిటువంటి వాటిలో కొవ్వు పదార్థం వుంది. బియ్యం, గోధుమలు, బంగాళాదుంపలు యిటువంటి వాటిలో పిండిపదార్థాలు వున్నాయి.

యీ పదార్థాలు అన్నీ రక్తంలో కలియడమువల్ల శరీరానికి సత్తువ వస్తుంది; అలసట తీరుతుంది. అయితే మనం భోజనం చేస్తాం. చేయగానే ఆ భోజనంలో వుండే పైన చెప్పిన పదార్థాలు రక్తంలో కలిసిపోతున్నవా?—అలా యెప్పుడూ కాదు. అలా చేరేలోపున మన శరీరంలోని యెన్నో మరలు ఆ పదార్థాన్ని యెన్నో విధాలుగా మార్చివేస్తవి. అది మహా తమాషాగా వుంటుంది.

మీరు స్కూలునుంచి వెళ్లి భోజనానికి కూచుని గబగబా అన్నంముద్దలు చేసుకుని నోటిలో పడవేసి మింగివేస్తూ వుంటే "అబ్బాయ్ అలా వొక్కమారుగా మింగకూడదు, నవిలిమింగు" అని అమ్మ చెపుతుంది. అలా చెప్పడం యెందుకు అనుకున్నారు? మీరు తింటున్న వాటిని జీర్ణం చేసుకోడానికీ వంట పట్టించుకోడానికీ యిదేమార్గం సుమా అని!

మనం తినే ఆహారంలో కొన్ని మెత్తటి పదార్థాలూ కొన్ని గట్టి పదార్థాలూ వుంటవి. వాటిని నోట్లో వేసుకుని పళ్లతో కొరికి, దంతాలతో నమిలి, నాలుకతో యిటూ అటూ కలియ తిప్పాలి. యిది అంతా మనం తింటూ వున్నప్పుడు దాని అంతట అదే జరిగిపోతూ రావాలి.

ఇప్పుడు మరొకసంగతి చెప్పాలి. మనం భోజనానికి కూచున్నప్పుడు రుచిగల పదార్థాలు చూచి నప్పుడు నోరు వూరుతుంది. అప్పుడు నోట్లోవచ్చే జలాన్ని లాలాజలం అంటారు. నోట్లో నలిగిన పదార్థాలతో యీ లాలాజలంకలిసి అది అంతా వొకవిధమైన పలచటి జారుడు పదార్థంగా తయారౌతుంది. అప్పుడది సాఫీగా గుటకవేయడానికీ మింగడానికి వీలౌతుంది. అంతే కాదు యీ ఉమ్మినీరు కలియడం వల్ల నోటిలో ఆహారంలోని పిండిపదార్థాలు చక్కెరగా మారుతవి. అలా తయారైంది, అన్ననాళం గుండా కడుపులోవున్న జీర్ణాశయంలోకి, అంటే తిత్తివంటి ఒకదానిలోకి వెళ్తుంది. ఆ తిత్తిలో ఆహారంయేమి ఔతుంది? ఆ సంగతులగురించి చెపుతా. ముందుగా జీర్ణాశయం తీసుకుందాం. ఈ జీర్ణాశయం దాన్ని అనుసరించే ప్రేవులతోపోలిస్తే పెద్దది. దీనిలోపలి భాగంలో - అంటే జీర్ణాశయంలో పక్కలను అంటుకున్న ట్టుగా చిన్న చిన్న గొట్టాలవంటివి అనేకంవున్నాయి. జీర్ణాశయంలోకి ఆహారం వచ్చింది అంటే యీ చిన్న చిన్న గొట్టాలు ఒక విధమైన రసాన్ని - దీన్నే జఠరరసం అంటారు - ద్రవిస్తాయి. యీ ద్రవం ఆహారపదార్థాలతో కలుస్తుంది. దానితో ఆ జీర్ణకోశంలో ఒక కదలిక యేర్పడుతుంది. ఆ కోశం విడవడం ముడుచుకోవడం - ముడుచుకోవడం విడవడం - యిలా జరుగుతుంది. ఈ కదలికవల్ల చూడండి మనవాళ్లు నానవేసిన పప్పును రుబ్బురోటిలోవేసి రుబ్బితే ఆ పప్పు నలిగి మెత్తని పిండి ఐనట్లుగా జీర్ణకోశంలోని ఆహారం కూడా మార్పుజెందుతుంది. ఈ మార్పులతో చివరకు ఆ పదార్థాలన్నీ పూర్తిగా రూపం మారిపోయి పాలవంటి ద్రవం అయిపోతవి. ఇక్కడే ఆహారపదార్థాల్లోని మాంసపోషకపదార్థాలుకూడా కరుగుతవి.

ఇలా రూపాంతరంపొందిన ఆ ద్రవాహారం అక్కడనే వుండిపోతుందా?—వుండదు. అక్కడి నుంచి జీర్ణాశయాన్ని అనుసరించివున్నవి అని చెప్పాన్నే ఆ ప్రేవుల్లోకి - చిన్న ప్రేవుల్లోకి వెళ్తుంది. ప్రేవులంటే యేమిటనుకున్నారు? జీర్ణకోశం తరువాత పొడుగ్గావున్న గొట్టాలు. ముందు చిన్న ప్రేవులు; ఆ తరువాత పెద్ద ప్రేవు. చూచారూ మరో తమాషా! మీరేమో 4 అడుగుల పొడవే వున్నారు కాని మీ పొట్టలోని ప్రేవులుమాత్రం 25 అడుగుల పొడవు వున్నవి! ఈ ప్రేవులు ఇంత పొడవున్నవంటే నమ్ముతారూ! మీరు ఆశ్చర్యపోతారు. కాని యిది నిజం సుమండీ! 20 అడుగుల పొడవు చిన్న ప్రేవులు 5 అడుగుల పొడవు పెద్ద ప్రేవు. చిన్నప్రేవుల్లోకి వెళ్లిన ఆహారపదార్థాలల్లో కొన్ని ద్రవాలు మధురరసం, పైత్యరసం యితర అవయవములనుంచి వచ్చి చేరి ఆహారాన్ని మరీ మార్చివేస్తై. ప్రేవుల్లో మరోరసం - దీన్నే ఆంత్ర రసం అంటారు - అదీ ఆహారంతో కలుస్తుంది. ఈ 3 రసాలు చేరడమువల్ల యిక్కడ ఆహారద్రవంలోని క్రొవ్వు పదార్థాలు అరుగుతవి.

అంతేగాక ఆహారద్రవంలో శరీరానికి అవసరమై యింకా రూపాంతంపొందని పిండిపదార్థాలు, మాంసపోషక పదార్థాలు రక్తంలో సులభంగా కలియడానికి తగ్గ పద్ధతిలో మార్పుజెందుతాయి.

ఇంత కర్మకాండా మనకు తెలియకుండా కడుపులోని యంత్రాల్లో జరిగిందీ అంటే, ఆ తిన్న ఆహారం యిన్నిమార్పులు పొందిందీ అంటే అది జీర్ణం అయిందన్నమాట! అంటే మనం తిన్న ఆహారం అనేక రూపాలుపొంది రక్తంలో కలిసి శరీరయంత్రం అంతా వ్యాపించి మనకు శక్తి, పుష్టి యిచ్చిందన్నమాట. ఇప్పుడు అర్థం అయిందా మీకు జీర్ణం అంటే యేమిటో? (రేడియో ప్రసంగము)

పిన్ని ఉత్తరాలు

## తెనుగుదేశం

సర్వమంగళా,

ఈమధ్య మీ చిన్ననాన్న, వాళ్ళ ఆఫీసుస్నేహితులతోకలిసి హంపీ క్షేత్రాన్ని చూడడానికి వెళ్లేరు. తిరిగివచ్చి, అక్కడి చిత్రాలన్నీ వర్ణించి చెబుతోంటే "నే కూడావెళ్లి ఉంటే బాగుండి పోనుకదా!" అనిపించింది నాకు. మనమంతా వెళ్లిచూద్దాం ఎప్పుడైనా. ఏం?

'హంపి' అనేది ఎక్కడుందో తెలుసా? మన తెనుగుదేశంలోనే. ఆ భాగాన్ని 'దత్తమండలం' అంటారు. అంటే 'ఇచ్చివేసిన మండలం' అన్నమాట. హైదరాబాదు నవాబు ఈ మండలాన్ని ఇప్పుడు రాజ్యంచేస్తోన్న తెల్లవాళ్లకి ఇచ్చేశాడు.

ఈ హంపి అనేచోట పూర్వం విద్యానగరం అని ఓ గొప్పపట్టణం ఉండేది. ఆ పట్టణంలో చాలా అందంగా ఉండే భవనాలూ, ఇంకా అనేకరకాల కట్టడాలు ఉండేవి. వీటినన్నింటినీ కట్టించిన రాజు పేరు శ్రీ కృష్ణదేవరాయలు. ఆయనకి లలితకళలంటే చాలాసరదా. ఎంతోడబ్బు ఖర్చుపెట్టి దేశదేశాలనుంచి పనివాళ్ళను రప్పించి, ఆయన ఆ నగరం కట్టించాడు. ఆ కట్టడాలన్నీ ఇప్పుడు ముక్కముక్కలైపోయి ఉన్నాయి. ఆ ముక్కలమీద ఉన్న చెక్కడపుపనిచూసినవాళ్లకి ఆశ్చర్యంకలిగి "ఆ నగరం నాశనంకాక పూర్వం ఎంత కన్నులపండువగా ఉండేదో" అనిపిస్తుందిట. ఆ నగరాన్ని నాశనంచేస్తే తురకలు. ఆ నవా

బులకీ విజయనగరరాజులకీ ఎప్పుడూ యుద్ధమే. ఆయుద్ధంలో చాలామాట్లు నవాబులు ఓడిపోయారు. ఆఖరికి ఓమాటు నెగ్గేరు. ఆ అదను చూసుకుని నవాబులు రాజులమీద ఉన్నకసి కొద్దీ విజయనగరంలో ఉన్న అందమైన కట్టడాలను అన్నింటినీ గొడ్డళ్లతో బద్దలు గొట్టించేశారు!

కృష్ణదేవరాయలుకు తెనుగుపద్యాలంటే చాలాసరదా. ఆయన బాగా చదువుకున్నవాడు. ఆయనే స్వంతంగా ఓపెద్దపద్యాల పుస్తకంరాశాడు. చాలామంది గొప్ప కవీశ్వర్లచేత మంచిమంచి పుస్తకాలు రాయించాడు. మన తెనుగుదేశాన్ని పూర్వంఏలిన గొప్పరాజులు, ఇంకా చాలామంది ఉన్నారు. ప్రతాపరుద్రుడు, రాజరాజనరేంద్రుడు - ఈపేర్లువిన్నావా నువ్వు? రెడ్లుకూడా రాజ్యంచేశారు మనదేశంలో. నువ్వు బొబ్బిలిపాట విన్నావుకాదూ? బొబ్బిలిలో రాజ్యంచేసినవారు వెలమదొరలు. తెలుగురాజులందరికీ మనభాషఅంటే ఇష్టమే. అందుచేత వీళ్లంతా కవీశ్వర్లచేత ఎన్నో పుస్తకాలురాయించారు. నువ్వు పెద్దదానివయాక ఈ పుస్తకాలన్నీచదివి ఆనందించాలి.

అటు విశాఖపట్నం మొదలు ఇటు చెన్నపట్టణందాకా ఉన్నదేశంకూడా తెలుగువాళ్లదే. ఇది కొండలకీ సముద్రానికీమధ్య చీలికలాఉంది. ఈ కొండల్ని "తూర్పు కనుమ"లంటారు. సింహాద్రప్పన్న, అన్నారం సత్యనారాయణమూర్తి, బెజవాడ కనకదుర్గా, తిరుపతి వెంకటేశ్వర్లూ — ఈ దేవుళ్లంతా ఈ కొండలమీదే ఉంట. ఈ చీలికలోనే మనఊరు ఉంది. ఇది చాలా సారవంతమైనదేశం. అంటే ఇక్కడ పంటలు బాగా పండుతాయి. పంటలు పండాలంటే పొలాలకి నీరుకావాలికదా! కావలసినంత నీరూ ఇవ్వడానికి మనకి గోదావరీ, కృష్ణానదులున్నాయి. ఈ నదులు ఎక్కడో వందలకొద్దిమైళ్ళ దూరాన్ని పుట్టి, అడవులూ, కొండలూ దాటుకుంటూవచ్చి అక్కడుండే మంచి ఒండ్రుమట్టి అంతా తెచ్చి మన భూమిమీద పెడుతున్నాయి.

ఈ నదులనీరంతా వృధాగా సముద్రంలోకిపోకుండా వీటికి ఆనకట్టలు కట్టేశారు. "ఆనకట్ట" అంటే నదికి అడ్డంగా, కట్టేసిన ఓ పెద్దగోడ. ఈగోడ అడ్డంగా ఉండడంచేత నీరు నిలిచిపోతుంది. ఈ నీటిని పెద్దపెద్దకాలవలుతవ్వి ఏపక్కకి కావాలంటే ఆపక్కకి తీసుకుపోతారు. ఆ పెద్దకాలవలూ, ఆ పిల్లకాలవల్లోంచి మళ్లీ బోదికాలవలూతవ్వి నీటిని పొలాల్లోకిరప్పించి పంటలు పండించుకుంటూరు. మీతోటప్రక్కనుంచి వెళ్లే బోదికాలవలో ఉన్ననీరు గోదావరిలోంచి ఇలా కాలవలగుండా వచ్చిందే!

అమ్మడూ, మనం తెనుగువాళ్లంగనక తెనుగుదేశం అంటే మనకి ప్రేమ ఉండాలి. మనభాషను ఎంతో శ్రద్ధతో నేర్చుకోవాలి మనం. తోటి తెనుగువాళ్ల బాగుకోసం మనం పాటుపడాలి. పరాయివాళ్లకి లోకువ ఐపోకుండా కట్టుగా ఉండాలి.

మీ ఊళ్లోఉన్న పెద్దవంతెన పేరేమిటో నీకు తెలుసా? "ప్రకాశం బ్రిడ్జి" "ప్రకాశంపంతులు" అని ఓ తెనుగుఆయన ఉన్నారు. ఆయన చాలా గొప్పవాడు. పూర్వం ఆయన ఓ పెద్ద ప్లీడరు. చాలా డబ్బు సంపాదించాడు. దేశంకోసం అంతా వదిలేసుకొని గాంధిగారికి మల్లే ఎన్నిమాట్లో జెయిలుకు వెళ్లేడు. ఆయనమీద ఉండే గౌరవంచేత ఆ వంతెనకు ఆపేరు పెట్టేరు. ప్రకాశంగారిలాంటి దేశభక్తులు ఆంధ్రులలో చాలామంది ఉన్నారు. సాంబమూర్తిగారినీ వినే ఉంటావు. వీరేగాకుండా మనదేశంలో, సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారని ఒకగొప్ప ఆయన ఉన్నారు. ఆయన బాగా ఉపన్యాసాలు ఇవ్వగలరు. అలాంటి ఆయనే కట్టమంచి రామలింగారెడ్డి అని మరొకాయనున్నారు. వీళ్లందర్నిగురించీ రాయడం మొదలెడితే చాలాఉంది. రాస్తూకూచుంటే పోస్టు తీసేవేళకూడా దాటిపోయేటట్లుంది. అంచేత ఇక్కడతో ముగించేస్తా.

పిన్ని.

# భావతరంగిణి   

"దేన్నిగాని అనువదించడానికి పూనుకొన్న కవి ఎంతసేపూ భావాన్నిపట్టి పోవలసిందేగాని మూలంలో వుండే పదాలనుబట్టి పోగూడదు. ఎవరో తెలిసీ తెలియని ఆక్షేపణలు చేస్తారని అనువాదకులు జంకి 'మక్కికి మక్కి' మార్గం అవలంబించకూడదు. మూలంలోనివి అవసరమైతే కొన్ని వదులుకోనూ వచ్చును, లేనివి చేర్చుకోనూ వచ్చును."

—శతావధాని, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.

"10 మాసముల క్రిందట ఒకరాట్నమైనా లేనిచోట ఇప్పుడు ఇంటింటికి ఒక రాట్నముచొప్పున స్థాపించి బట్టకుగాని, తిండికిగాని, వైద్యానికిగాని మరి ఏ యితర జీవనావసరమైనవాటికిగాని గ్రామముదాటి పైకి పోనవసరములేక ఒక గ్రామాన్ని స్వయంపోషకంగా తయారుచేశాము. తృప్తికి, ఆనందానికి, శాంతికి దూరములైపోయి, ప్రజల్లో బద్ధకము, పేచీకోరుతనము వృద్ధిఅయి భగ్నమైపోయిన పల్లెలను పునరుద్ధరించడమే కాంగ్రెసుయొక్క ప్రధానాశయం."

—టంగుటూరి ప్రకాశంపంతులు.

"నాకే కనుక అధికారముంటే ప్రతిపల్లెకు ఒక ప్రాథమిక పాఠశాల, ఒక ఉచిత వైద్యాలయము, ఒక గ్రంథాలయము నెలకొల్పి, పల్లెలను ఆదర్శగ్రామాలను చేసేదానను."

—కె. రామసుబ్బమ్మ.

"నేటి స్త్రీలలో శరీరపాటవము అంతరించింది. సుఖజీవనము, విలాసాలు, నిర్వ్యాపకము, అమిత ఖర్చు, స్త్రీ సంఘంలో కాలమహిమవల్ల మితిమీరిపోతోంది. అందువల్ల ముప్పది సంవత్సరాలకు పూర్వం స్వర్గధామముగా వున్న హిందూగృహం నేడు గృహలక్ష్మిలేని గృహంలాగ వెలవెలబోతూవుంది. కనుక ప్రప్రథమమున మన సాంఘికజీవితమును సంస్కరించడం మన ప్రథమ కర్తవ్యం."

—చుండూరి రత్నమ్మ.

"హిందువులకొకవిద్య, ముస్లిములకొకవిద్య పనికిరాదు. సర్వసామాన్యంగా భారతీయుల కందరికిని పనికివచ్చేవిద్య ఒక్కటిగానేవుండాలి. దానితోటే జాత్యైక్యం ఏర్పడుతుంది. అమెరికా మొదలైన దేశాలకు మనకు వున్న తేడాయే ఇది."

—అమ్మ స్వామినాథన్.

"అఖిలభారత మహిళాసభలో వివిధ రాజకీయ పక్షాలవారు, మతాలవారు చేరి స్త్రీలకు సంబంధించిన సమస్యలను యేకీభావంతో చర్చిస్తున్నారు. అట్లాగే భారతసమస్య విషయంలోగూడా భారతీయులు ఏకీభావంతో వుండడం కష్టమైనపనిగాదు. దీనికి ప్రభుత్వం ఎందుకు తోడ్పడగూడదు?"

—ఆచంట రుక్మిణి లక్ష్మీపతి.




# చిత్రలేఖనము

సృష్ట్యాదినుండియు
మానవునకు సన్నిహిత
మైన యీ కళయొక్క
పుట్టుక, పరిణామము

★

శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య

★

భూమిమీద మానవుడేర్పడినప్పటినుండియు చిత్రలేఖన మెద్దియో యొకవిధమున యుండినది. వస్త్రములను నేయుట యెరుగని అత్యంత ప్రాచీనకాలమున శీతాతపవేదనలనుండి దేహమును కాపాడుకొనుటకై యొడలికి మెత్తని మట్టినో ఆకుల పసరులనో నలదికొనుట వాడుకయై యుండినది. కాలము గడచిన కొలదియు, నాగరకత హెచ్చిన కొలదియు ఉన్ని, దూది లోనగునవి పరిధాన పరికరములుగ యేర్పడి పైన చెప్పిన మట్టి పూతయు ఆకుల పసరు పూతయు అందముక్రిందయు, అనాది శిష్టాచారముల క్రిందయు నిలిచి యుండినవి. అనగా గోడమెత్తినట్లుగాక ఈ పూతలను ఆకుల తీరుననో, తీగెల తీరుననో, పువ్వుల తీరుననో చూడ సొంపగు జింక, నెమలి తీరుననో దిద్దుకొనుచుండిరి. ఇట్లు ప్రథమస్థితిలో దేహస్వాస్థ్యమునకై యేర్పడిన మట్టిపూతలు అలంకారప్రాయములైపోయినవి. ఇట్టి అలంక్రియా విశేషములు ఈనాటికిని భస్మోద్ధూళన భస్మధారణము రూపముగను, గోపీచందన ధారణముగను, తిరుమణి కాపుగను, గంధ విలేపనముగను పరిణమించి మతసూచకములైనవి. పచ్చ పొడుచుకొనుటయు ఈ గణములో చేరినదియే. గైరికాది ధాతువులగూడ వాడుచుండిరి. సీతాదేవి చెక్కిడిలపై శ్రీరాముడు మణిశిలచుక్క బెట్టినట్లు వాల్మీకి రామాయణమున గలదు.

మనశ్శిలాయాస్తిలకో గండపార్శ్వే నివేశితః ॥ (సుందరకాండ. 40 - 5.)

ఈ మహానాగరకయుగమున చిత్రలేఖనము అను పేర వర్ధిల్లుచుండు కళ కంకురమట్లాదిగనె యుండవచ్చును. ఎంత గొప్ప చిత్రకారుడైనను ప్రపంచములో లేనట్టి వస్తువును చిత్రించినట్లెచటను అగపడదు. ఏదియో నొక పుష్పమునకో, జంతువునకో, మానవాకృతికో ప్రతిరూపము వ్రాయును. అట్లుగాక ఒక్కొకపుడు నరసింహామూర్తిగనో, గజాననుడుగనో, నాగకన్యగనో సృష్టిలో నుండువానిని రెంటిమూటి కలిపి యొక చిత్రము వ్రాయును. ఇంతకును చిత్రకళకు బీజము అనుకరణము. ఒకదాని పోలికను రంగులతోగాని పట్టి గీతలతోగాని చూపుట.—

ప్రథమదశలో చిత్రలేఖకులు తమ ప్రభువులపాలనయో, లేక యుద్ధముచేయుటయో చిత్రించుచుండిరి. అవి ప్రాచీన చిత్రలేఖనములు ప్రాయికముగ నిట్లుగనె యున్నట్లు చరిత్రకారులు తెలియబరచియున్నారు. కొంతకాలము గడచినకొలదియు వారివారి మతసంబంధములగు గాథలును దేవతాలీలలును చిత్రింపబడుచు వచ్చినవి. మన భరతఖండమున హైదరాబాదు సీమలోని అజంతా గుహలలోని చిత్రవర్ణలేఖనములు ప్రాయిక గౌతమబుద్ధుని చరిత్రాంకములుగ నున్నవి. ఈ చిత్రములు వ్రాయబడి దాదాపు రెండువేలయేండ్లయినట్లున్నది. అందులో మాసిపోయినవియు, ఎండకు గాలికి వానకు చెడిపోయినవియు గాక నిలిచియుండునవి ఇపుడు ఈ దినము వ్రాసినట్లున్నవని గ్రంథములో గలదు. ఇవి మరికొన్ని గుహలయందును గలవు. కుంభకోణములోని శ్రీరాములవారి దేవాలయపు గోడలమీద రామాయణ కథ యంతయు చిత్రింపబడియున్నది. ఈ విధమున రాజపోషణవలనను, మతాభిమానమువలనను ఈ చిత్రకళ మన దేశమున గొప్ప వికాసమును అభివృద్ధిని పొందినది. వేదముల కాలములో ఈ కళ యెట్టి స్థితిలో యుండినదో చక్కగ తెలియరాదు. చిత్రశబ్దమును, చిత్రకర్మశబ్దమును వేదమున నగపడుచున్నవి. పౌరాణికేతిహాసముల కాలమున నీ కళ పెంపొందియుండినది. హనుమంతుడు రావణుని వేశనమును వర్ణించుటయు చిత్రశాలలనుగూడ జూచినట్లు సుందరకాండ ఆరవ సర్గయందున్నది. 'లతాగృహాణి రమ్యాణి చిత్రశాలా గృహాణిచ.' భాగవతాదులయందు ఉషాపరిణయ కథయందు చిత్రరేఖయొక్క చిత్రలేఖన ప్రశంస నెరుగనివారుండరు.

ఇక కావ్యనాటకాదులలో చిత్రలేఖన ప్రస్తావములు లెక్కకు మిక్కిలిగ నున్నవి. రఘువంశమున పదియారవ సర్గయందు 16_17 శ్లోకములందు చిత్రలేఖన ప్రసక్తి కలిగియున్నది. ఉత్తరమేఘమను 44 వ శ్లోకమునను గలదు. అశ్వఘోషిణి యుద్ధచరితమునందును యున్నది.

నాటకముల విషయమున భాసుని ప్రతిమా నాటకమందును (ఇమాం దశరథస్యత్వాం ప్రతిమాం కింన పృచ్ఛసి) కాళిదాసు శాకుంతలమున నారవ యంకమునను ఉత్తర రామచరిత్ర ప్రథమాంకమునను—

ఆర్య అర్జునేన చిత్రకారేణ అస్మదుపదిష్టం ఆర్యస్యచరితం అస్యాం వీధ్యాం విలిఖితం

రత్నావళి మాళవికలందును - నాగానందమునందును ఇత్యాద్యనేకముల చిత్రరచనా ప్రస్తావము కలదు. సంస్కృత కావ్యాదుల ననుకరించి తెలుగు కావ్యములందును చిత్రలేఖన ప్రశంస చూడబడుచున్నది.

ఐరోపాఖండముననుండి రంగులు రాకమునుపు ఇచటి చిత్రకారులు నానావర్ణముల నెట్లు చేసికొనుచుండిరో చిత్రముగ నున్నది. తెలుపురంగు ఒక జాతి సీసమునుండియు, నలుపు కరిదూపము కాటుకనుండియు, ఎరుపు కావిరాయి, ఇంగిలీకము లోనగువానినుండియు, నీలము నీలిమందువలనను, ఆకుపచ్చ కొన్నిచెట్ల ఆకు పసరులనుండియు, గౌరవర్ణము పసపు, హరితాళము లోనగువానివలనను చేసికొనుచుండినట్లు యొక ఇంగ్లీషు గ్రంథమన్నది. ఇట్టివి కొన్ని రంగులు మూలవస్తువులుగ యేర్పరచుకొని వాని సమ్మేళమున ఇతర రంగులు ఛాయలు (tints) చేసుకొనుచుండిరి. కరకకాయ, అన్నభేది, పటిక ఇవియు విశేషముగ వాడబడుచుండినవి. లక్కయు ముఖ్యముగ నుండినది.

ప్రాతకాలపువారి కుంచెలు (brushes) బహుశః పీచుతో చేయబడినట్లు కనుపడుచున్నవి. ఉడత బొచ్చు, ఒంటె వెంట్రుకలు ఇత్యాదులతో చేయబడిన కుంచెలుండినట్లు లేదు. 'కుంచె' అను మాట 'కూర్చ' అను సంస్కృత శబ్దభవము. దర్భపోచలతో చేయబడు కూర్చలను బ్రాహ్మణులు హవ్యతత్వములలో చూచుచుందురు. కుంచెను తూలిక యనుటయు కలదు. దీనికే 'వాగెఱ' యను నొక మాట గలదు. వాగెఱ యనగా (వాయు+కట్టు) అని సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమున నిష్పత్తు వ్రాసియున్నారు.

## కళా కలాపము

ప్రాయికముగ చిత్రములు ఇండ్ల గోడలమీద వ్రాయబడుచుండినవి. వస్త్రములమీదను, కొయ్య పలకలమీదను, అద్దములమీదను, మృణ్మయపాత్రలమీదనుకూడ చిత్రింపబడుచుండినవి. చిత్రప్రయోగమునకు ముందు గోడను చక్కజేయవలసిన విధము భరతనాట్యశాస్త్రమున రెండవ అధ్యాయమున 84_86 శ్లోకములం దిట్లున్నది—

భిత్తిష్వపిచలిప్తాసు పరిమృష్టాసు సర్వతః। సమాసుజాతశోభాసు చిత్రకర్మ ప్రవర్తయేత్ ॥

చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషా స్త్రీ జనా స్తథా। లతాబంధాశ్చకర్తవ్యాశ్చరితం చాత్మభోగజం॥

సృష్టిలో యేవస్తువెట్లుండునో చిత్రమునకూడ నట్లే యుండవలెనను గొప్ప నియమము గలదు. విష్ణు ధర్మమున నిటులున్నది—

జంగమావా స్థావరావా యేసన్తి భువనత్రయే। తత్తత్స్వభావత స్తేషాం కరణంచిత్రముచ్యతే॥

చీమబొమ్మ వ్రాయువాడు దానికి నాలుగుకాళ్లు, సన్నని నడుము చూపవలయునే గాని ఇందుకు విరుద్ధముగ నుండగూడదని చిత్రకారుల సంప్రదాయమైయున్నది. చిత్రలేఖనము ప్రకృతిని మరిపించునట్లును ఇది యే ప్రకృతిలోని వస్తువని భ్రమించునట్లు చేయగలిగియుండవలెను. ఇట్టి యాశయమును ముందిడుకొనిగా మాఘుడు (3, 50) ఈ క్రింది శ్లోకమును వ్రాసియుండెను.

చిత్రింసయా కృత్రిమ పత్త్రిపజ్క్తేః కపోతపాలీషు నికేతనానాం।

మార్జారమప్యాయదనిశ్చలాంగం యస్యాంజనః కృత్రిమమేవమేనె ॥

చిత్రలేఖనమున రచింపబడిన కృత్రిమ కపోతములను నిజమయిన పావురములని పిల్లి భ్రమించి మ్రింగజూచుచున్నట్టు భ్రమ నాధారపరచుకొని ఈ మహాకవి ఆ పిల్లినికూడ కృత్రిమ పిల్లియా యని ప్రతి యోగి భావము కల్పించినాడు. ఇట్టి కథ యొక్కటి గ్రీసుదేశపు గాథలలో నున్నది.

ఇద్దరు చిత్రకారులుండిరి_వీరిద్దరిలో నిపుణవరుడెవడని పోటీకలుగగ ప్రాశ్నికులు (Umpires) వీరిని చేరియొక చిత్తరువు వ్రాయమనగ మొదటి వాడు ఒక గోడమీద ద్రాక్షతీగెలను ద్రాక్షపండ్ల గుత్తులను చిత్రించెను. ఆ చిత్రపు గుత్తులను నిజముగా ద్రాక్ష పండ్లనుకొని అనేకపిట్టలు వచ్చి వాని ముక్కులతో ముట్టి నిరాశచెంది పోవుచుండినవి. ఈ చిత్తరువు మెచ్చతగినదిగ నున్నదని ప్రాశ్నికులుజెప్పి - రెండవవాని బిలిచి అతడువ్రాసిన చిత్తరువు జూపమనిరి. అతడూరక నొకగోడమీద నొకపరదా పట్టు స్వరూపము చిత్రించెను. చూడవచ్చినవారు నీ చిత్తరువు ఎచటనున్నదని యడుగగ విశేషమేమియు చెప్పకమీరే చూచుకొనుడనుచుండెను. వచ్చిన పెద్దలందరు ఒకరివెనుకనొకరు అతడుచిత్రించినపరదా నిజమగుపరదాయని దానివెనుక ఈతని చిత్రలేఖనమున్నదను భ్రమతో ఆచిత్తర్వు పరదాను ఇటునటు త్రోయ మొదలిడిరి అంతట అచటి పెద్దలు ఈ పరదా చిత్రకారుడే నిపుణతర చిత్రకారుడని తీరుమానించిరి. చిత్తర్వు ప్రవృతిని మరిపించుట యనగ నిట్లుండ వలయుగదా. ఇట్లు భావమునె కాబోలును కాళిదాసు మనసుననుంచికొని శకుంతల మన "చిత్రేనివేశ్య పరికల్పిత సత్త్వయోగా" యని శకుంతలను వర్ణింపజేసియున్నాడు. సజీవమగు స్త్రీరత్నమునే ధాతసృష్టించి ఆవెనుక దానియందెద్దియేని లోపముకనుగొని అట్లు లోపమనుసరింప వలను లేక పశ్చాత్తప్తుడు కాకుండుటకై తొలుదొల్త తన యిష్టముచొప్పున సర్వాంగ సౌష్టవముగల చిత్రప్రతిమను చేసి తృప్తిపడి దానియందు సవరింపవలసిన దేమియులేదని నిర్ణయించుకొని అటుతర్వాత దానియందు సత్త్వయోగము జేసినట్లుకవి అద్భుతకల్పన చేసియున్నాడు, ఇట్లు పరిపూర్ణతనె మనసునందుంచుకొని షేక్సుపియరు విషయాంతర ప్రసంగమున 'Hold mirror up to nature' అని యుపదేశించి యున్నాడు - కళా కౌశల మెట్లుండవలయుననగ - ప్రకృతికి అద్దము చూపినట్లుండవలయునని భావము.

(సశేషము)

# ★ స్త్రీ మూర్తి ★

శ్రీ అనుముల వేంకటశేషకవి

అఖిలకావ్య పురాణేతిహాసములకు మూలకందమ్మవై, జగమ్ముల సృజించి
వృద్ధి నొనరించి, హతముఁగావింతు వీవె!. 'స్త్రీ' యనెడిపేరి సంకల్ప సిద్ధురాల

వెల్లలోకములకుఁ బ్రణయేప్సితార్థ ఫలములను బంచు పుణ్యదేవత వటంచు;
నీసహస్రనామావళి నియతిఁబూని జపమొనర్చెడి నీరేడు జగము; లబల!

స్వర్గమును నీవులేక శ్మశానవాటి; నీకుఁగాని రసంబులు నీరసములు;—
పలుకు మింతింత మహిమ లేవగిది నీకుఁ బట్టువడినవో? పురుషైక భాగ్యరాశి!

తేనియతీపి కమ్మవిరి తెమ్మెర లూర్పుల గుప్పి; లోక క
ళ్యాణకరంబులైన కమలాప్తుని కాంతుల మంచి ముత్తెపున్

సోనలఁ గప్పి మాటలను, జూపులఁ, జేష్టలలో సుధాంబువుల్
బానలఁ గుమ్మరించెదవు, ప్రాణి శుభస్కర కామధాత్రివై.

తల్లివో? పిల్లవో? సతివో? దాదివో? సోదరివో? ప్రపంచమం
దిల్లని యున్నచోట నెది యే నొక రూపముదాల్చి, నీవు వ

ర్ధిల్లనిదేది? నీ కొఱకు దేవ, మనుష్య, పిశాచ, దైత్యరా
ట్తల్లజు లేనియున్ దలఁ దాల్పని ధర్మములున్నె? కామినీ!

ఎన్ని కలంబు లింతవర కెన్ని ప్రబంధములెల్ల దీక్షగా
నిన్ను గుఱించి కుంచియలు నీపయి వన్నెల వెన్నిదిద్దె? నీ

సన్నుతి నెన్ని కీర్తనలు చక్కనివయ్యెఁ బ్రపంచ భాషలన్?
బున్నియమన్న నీదెకద? పూరుష జీవిత జీవదాయినీ!

కోయిల నీదు కంఠమునఁ గూర్చొని కూయునొ? రక్తనాళముల్
తీయని వీణతంత్రులయి తిన్నగ మ్రోగునొ? యెల్లలోకమున్

సోయగమిట్టి నీ తనువుఁ జొచ్చి చిగుర్చునొ? నీ ప్రశస్తి కిం
కే యది కారణంబొ? వచియింపుము! ప్రేమరసాధి దేవతా!

అబలవే! కావు సబలవీ వాత్మశక్తి రూపిణివియు, సత్యాగ్రహో ద్దీపనమున
మహిషరూప పశుత్వంబు మ్రందఁజేయు త్రిపురసుందరివయ్యును, స్త్రీవి; దేవి!—



# మనోహరత్వము - స్త్రీ యొక్క మొదటి వలపు

సౌందర్యమునకు ఇవ్వబడునటువంటి శ్లాఘనను ప్రతి స్త్రీ కోరును. నిజముగా అందమునకు మనోహరమైన చర్మము అత్యావశ్యకమనునది చాలజనులు మరచిపోవుదురు. శుభ్రముగా, శ్రేష్టమై మృదువుగా ఉన్న చర్మము స్నేహితులయొక్కయు, బంధువుల యొక్క శ్లాఘనను పొందును.

చర్మమువాడకుండ లేతగా నుంచుకొనుటకు ప్రతియొక్క స్త్రీ జాగ్రత్తపడ నవసరము. వట్టి కడుగుటలో రంధ్రములలో నుండు మురికిని తొలగించజాలదు. పాండ్స్ క్రీమ్, రంధ్రములలో దూరి, దాని నుండు ఆ అరోజు మురికిని, నూనెవిశేషమునుతీసి శుభ్రముగా నుంచును.




పాండ్స్ క్రీమ్ సీసాను కొనుడు. మీ వేళ్ల చివరలతో క్రీమును, మీ చర్మముమీద రాయుడు. మృదువైన గుడ్డతో దులుపుడు. మరియు కొద్దిగా వేరే క్రీమును దేలికగాపూసి రాత్రంతయు ఆ సాణ్యమైన పొరను ఉంచుడు. ఈ మోస్తరుగా ఒక పదిహేనురోజులు రాత్రులయందు వాడుడు. అప్పుడు మీ చర్మము మృదువుగా లేతగాఅవుతున్నట్లుమీకు తెలియగలదు.

పగలు గాలి,దుమ్మునుండి రక్షించుటలో శ్రేష్ఠమైనది పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్.

పాండ్స్ క్రీములు అన్ని గొప్ప స్టోర్సులలో దొరకును. లేక పాండ్స్ పి||ఓ|| బాక్సు 144 బొంబాయి వారికి వ్రాయుడు.

# పాండ్స్ క్రీమ్

# దమయంతి కాలంలో విడాకులు ఉండి వుండాలి

## (పాతగాథల్లో కొత్తవూహలు)

★ శ్రీ ఆచంట సూర్యనారాయణమూర్తి

"దమయంతిని వివాహమాడిన నలునియెడ ననూయజెంది కలిపురుషుడు నలుని బాధింప సమకట్టి పుష్కర మహారాజుతోడి కపట ద్యూతమున నలు నోడించి పురమునుండి వెడల నడిపించెను. నలుడు అరణ్యములయందు భార్యతో తిరిగితిరిగి యామెను పరిత్యజించి కర్కోటకునిచే గఱవబడి తన రూపమును బోగొట్టుకొని బాహుకుడను పేరుతో ఋతుపర్ణ మహారాజునింట వంటలవాడుగా కుదిరెను. దమయంతి యీ సమాచారమును గొంతవఱకు పర్ణాదుడను విప్రునివలన నెరింగి తనకు ద్వితీయ స్వయంవరమనుసాకు కల్పించి ఋతుపర్ణుతో గలసి నలుడు విదర్భకు వచ్చునట్లు జేసెను. తరువాత కేశినియను చెలికత్తెవలన నలుని చరితం బిమ్ముగా నెరింగి దమయంతి యతనిని అంతఃపురమునకు రావించెను. ఒకరినొకరు గుర్తించుకొనుచు, నెత్తి పొడుచుకొనుచు, తుదకు శంకించుకొను సమయమున నఖిల భూతాంతర్గతుండైన వాయు భట్టారకుండు దమయంతి పాతివ్రత్య విషయమై గట్టిసాక్ష్యమునివ్వ నలదమయంతులు కలుసుకొనిరి. అంత పుష్పవృష్టి కురిసినది. సురదుంధుభినాదములు మ్రోగినవి. సకల భువనములు సంతసించినవి."

—ఇది పురాణాల్లో మనం చదివేకథ. ఇంతకంటే వ్రాయడం చర్విత చర్వణం. కథ చెప్పకోడం మన ప్రస్తుత కర్తవ్యంకాదు. ఈ కథవల్ల ఒకగొప్ప సాంఘిక ఆచారం మనదేశంలో వెనకటి రోజుల్లో ఉండేదని తేలుతోంది. స్వయంవరాచారంవలె యిదికూడా కారణాంతరాలవల్ల అడుగంటి ఉంటుంది. సురవరుల్ని మెచ్చక తన్ని వివాహమాడిన ప్రేమ స్వరూపాన్ని, నిర్దయుడై-కాదు-అప్రయోజకుడై అరణ్యమధ్యమంలో ఒంటిరిగా నిద్రపోతూన్న సమయంలో అర్ధరాత్రివేళ విడిచిపెట్టి పారిపోయిన సాటిలేనిమేటి ప్రాణేశ్వరుణ్ణి విదర్భకు రావించుకోడానికి ఉపాయంగానే దమయంతి తన ద్వితీయ స్వయంవరాన్ని ప్రకటించిం దనుకుందాం. దమయంతి పేరూఊరూలేని ఆడదికాదు కదా! విదర్భ దేశాధీశుడైన భీమసేన మహారాజు కూతురు. నిషిధాధిపతియైన నలునిభార్య. ఆమె ప్రథమ స్వయంవరానికి దేవతలు దగ్గరనుంచి వచ్చారు. సాక్షాత్తు భారతీదేవి స్వయంగావచ్చి స్వయంవరానికి వచ్చిన రారాజుల్ని గురించి దమయంతితో చెప్పింది. అలాటి దమయంతి, ఆకాలంలో స్త్రీకిగూడ ద్వితీయవివాహం ఆచారంలేనిదే, తన ద్వితీయస్వయంవరాన్ని చాటింప సాహసించదు; తండ్రివప్పకోడు. పోనీ స్వలాభంచేత తండ్రీ, కూతురు అబద్ధం సాటింపు వేయించారుబో! నాలుగుపాదాలా ధర్మాన్ని పాటిస్తూ తమతమ రాజ్యాలలో న్యాయనిర్ణయం చేస్తూ రారాజులు అలాటి అసందర్భపు మాటవిని సహించి ఊరుకుంటారా? పైపెచ్చు దమయంతిని వివాహమాడ్డానికి మేమమ్మా తగుదుంఅంటూ పెళ్లికొడుకులుగా తయారవుతారా? పట్టిమాట! ఎప్పటికీ అలాజరిగి ఉండదు. తప్పకుండా ఆకాలంలో విడాకుల ఆచారం ఉండి ఉండాలి. దమయంతి విసిగివేసారి తిరిగ పెళ్లి చేసుకుందామని ప్రయత్నాలు చేస్తూన్న సమయంలో నలుడు తిరిగివచ్చి బ్రతిమాలుకునేనా ఉండాలి. లేదా, పాపం నిజంగా దమయంతి తాను వరించిన నలుణ్ణి తిరిగి తన దేశానికి రప్పించుకునే ఉపాయంగా ద్వితీయస్వయంవరం సాటించినా, అలాటి ఆచారం ఆరోజుల్లో ఉండి తీరాలి. ఆచారంలేనిదే దమయంతి ద్వితీయ స్వయంవరాన్ని ప్రకటించలేదు. బాగా ఆలోచిస్తే యీ రహస్యం మనకు తెలియకమానదు.

# ఆంధ్రజాతిలో —

ఆత్మగౌరవం అడుగంటి పోతూవుంది
జాత్యభిమానం జీర్ణమై పోతూవుంది
స్వతంత్రశక్తి సడలిపోతూవుంది
అందుచేత 'మనది' అంటే మనకే గౌరవం
లేనప్పుడు 'మనము' అంటే ఇతరులకు గౌరవమా?

— శ్రీమతి —
బసవరాజు రాజ్యలక్ష్మమ్మ



సోదరీ!

నీ వుత్తరం అందినది. నేను నీకు చాలా బాకీపడ్డమాట నిజమే! మాట చెల్లించుకునే రోజులాయినీ
రెండు సంవత్సరాలనుంచీ హిందీ వాతావరణంలోపడి తెలుగుబాషకి రెండువందల మైళ్ళ దూరంలో వున్నప్పటికినీ మనభాష మన సాంప్రదాయం మన ఆచారం మరచిపోలేదులే—భయపడకు.

మొన్న ఈ వూరిలో ఒక గానసభ జరిగింది కర్ణాటక సంగీతం అద్భుతంగాపాడేడు. ఈ రోజులలో కవులను, గాయకులను, పండితులను ఆదరించేవారెవరున్నారు? ఆ గానసభకి ప్రేక్షకులు యెంతమంది వచ్చారనుకున్నావు? సరీగా లెఖ్ఖపెడితే పాతికమందికూడా వుండరు: అప్పుడు నాకు చాలా ఆశ్చర్యము విషాదముకూడా కలిగింది, అదే ఏ సినిమాపాటలో, సావిత్రి, చింతామణి రికార్డులో అయితే వేలకువేలు జనం మూగేవాళ్లే. ప్రతి సినిమాహాలుదగ్గరా సాయంకాలం అయిదున్నర గంటలయ్యేటప్పటికి జనం గుంపులు గుంపులుగా వుంటారే? సినిమాపాటల రికార్డు వినటానికి. కర్ణాటక సంగీతమంటే వీరి కంత యేవగింపు యెందుకనో?

మనలో సరియైన అభిరుచి నానాటికి క్షీణిస్తోంది. జనసామాన్యంలో యేది యెక్కువ ప్రచారంలో వుంటుందో దానియందే అభిరుచిగలుగుతుంది. యిప్పుడు సినిమాపాటలకున్న విలువ యే రామకృష్ణయ్యగారి పాటకో, ద్వారం వెంకటస్వామినాయుడుగారి ఫిడేలుకో, వీణ శేషన్నగారి వీణకో వున్నదా? యిప్పుడు యెక్కడచూచినా సినిమాపాటల రికార్డుతప్ప ఒక్క త్యాగరాజుకృతిగల రికార్డు వినపడుతోందా?

దక్షిణదేశంలో యెంతమంది విద్వాంసులులేరు? యెన్ని గొప్పవాద్యాలులేవు? వీణా, జలతరంగం, వేణూ, ఫిడేలు, సారంగ, సితారు, యిలాంటివెన్నో మన హృదయతంత్రులను మోగించి మనలో చైతన్యవికాసం గలిగించి మనలను హర్షాతిశయంలో పరవశులనుగాజేసి క్షణకాలం మన్ని ఈశ్వరసాన్నిధ్యంలోకి తీసుకునివెళ్లే మహోత్కృష్టమైన వాద్యాలు, గాయకులు యంతమందిలేరు? కానీ? మన శాస్త్రాలుగాని మన గానముగాని ఈ ఆధునిక యుగానికి పనికిరావుగాబోలు!

ఒక్కొక్క రాగమహిమను గనక మనం తెలుసుకున్నట్టయితే ఆశ్చర్యపడతాము. అక్బర్ చక్రవర్తి దర్బారులో గాయకుడైన తాన్‌సేను రాగమహిమనుఅక్బర్ చక్రవర్తికి చూపించటంకోసం నీళ్లల్లోదిగి దీపక్ రాగము ఆలాపిస్తే నీళ్లు వేడెక్కి క్రమేణా వుడికి పొంగులొచ్చినయిట?

అటువంటి పవిత్రమైన మన సంగీతాన్ని వుత్తర హిందూస్థానపు సంగీతానికి మల్లే పారసీకులు, ముసల్మానుల సంగీతాలవల్ల కలుషితం కాకుండా శతాబ్దాలనుంచీ కాపాడుకుంటూ వచ్చారు మన దాక్షిణాత్యులు. అటువంటి దానిని పాశ్చాత్యులు కొనియాడుతున్నారు? గాని మనం దాని స్వారస్యం గ్రహించలేకుండా వున్నాము. మన సంగతి యేదైనా అంతే. పాశ్చాత్యుల ముద్రపడేవరకూ మనం మన గొప్పతనం

తెలుసుకోలేము. దామెర్లరాముణ్ణి సీమలో మెచ్చారుగాని మనమధ్యనేవున్న చిత్రకారుణ్ణి కనుక్కోగలిగేమా? మన అజంతాచిత్రాల్ని దుమ్ము ధూళిదులిపి వాటి ఫోటోగ్రాఫులు తీసుకెళ్లి లండన్ ప్రదర్శనశాలలో ప్రదర్శించేటంతవరకు అసలు అవి ఒకటివున్నవని మనకు తెలుసునా?

మన టాగూరుగారిని, మన బోసుగారిని, రాధాకృష్ణయ్యగారిని తెల్లవాళ్లు పైకి తీసుకొచ్చి చూపేటంతవరకు మనకు తెలుసునా?

మాక్సుముల్లర్ జర్మనీనుంచి వచ్చి చచ్చిచెడి సంస్కృతం నేర్చుకుని మన వేదాలను తీసుకెళ్లి జర్మనులు అచ్చువేయించి ప్రకటించేటంతవరకూ వాటి గొప్పతనం గ్రహించగలిగామా? యేదైనా అంతే—మన విలువమనం తెలుసుకోలేము?

మన పరిశ్రమలవిషయంలోకూడా అంతే. మనపత్తి యింగ్లాండుదర్శనం చేసుకుని యే లాంక్‌షైరులోనో మెరుగుపెట్టించుకుని బట్టరూపంలో తైయారయి యెక్కువ ధరవేసి వాళ్ల లేబిలుతో వస్తేగాని కొంటామా? అల్లాగే యిప్పుడు సినిమాపాటలకున్న విలువ మన కర్ణాటక సంగీతానికిలేదు? ఏది యెక్కువ ప్రచారంలో వుంటుందో దానియందే ఆసక్తి, అభిరుచీ ప్రబలుతుంది. నలుగురూ సినిమాపాటలు బాగున్నయ్యంటే మనమూ బాగున్నయ్యంటాము. అసలు రసం గ్రహించలేము.

నిజంగా అరవలలోవున్న ఐకమత్యము, దేశాభిమానము మనలో లేదుగదా?

ఆంధ్రులది వట్టిమాటల్లోనే? అరవలు క్రియలో చూపిస్తారు? అరవలు యే దేశంలోవున్నాసరే వాళ్ళకట్టు, వాళ్లభాష, వాళ్లదేశాభిమానం మాత్రం వదలరు? యెంత దూరదేశంలోనైనా సరే నలుగురు అరవలు చేరారంటే అక్కడ ఒక సౌత్ యిండియన్ అసోసియేషన్ దాని తరపున ఒక గ్రంధాలయం, ఒక సంగీత సమాజం యేర్పడ్డాయన్నమాటే? ఈవిధంగా వారి జాతిగౌరవాన్ని నిలబెట్టుకుంటారు.

యికమనమో మన విలువ మనకు తెలియదు. మనలోమనకి ఐకమత్యంలేదు? మనవిలువే మనం తెలుసుకుంటే ఈనాడు కవులకు, గాయకులకు, పండితులకు స్థానంలేకుండాపోతుందా?

బొంబాయి, నాగపూర్, మైసూర్, బర్మా, మలయా, జావా, దక్షిణాఫ్రికా మొదలైన దేశాలకు వలసపోయిన మన ఆంధ్రులకు జన్మభూమియందు ఎంతప్రేమా, అభిమానంవున్నదో చూడు? మనభాషే మరచిపోయి మన ఆచారాలు మన సాంప్రదాయాలు పూర్తిగా వదిలేసి మన సంబంధాలే మానుకుని అక్కడే స్థిరనివాసం యేర్పరుచుకుని వేరొకజాతిగా తయారైనారు. పేరుకుమాత్రం ఆంధ్రులమని చెప్పుకుంటున్నారు.

దక్షిణాత్యులు నిజంగా కళారాధకులు. జాతి మతాభిమానులు. నిజం చెప్పాలిసివస్తే సంగీతవిద్వాంసులను అరవవారు ఆదరించినట్లు మనం ఆదరించటంలేదు? వారిలో సంగీతానికున్న ఆదరణా అభిరుచి మనలోలేదు? వారిలో ఆడవారుకూడా నూటికి యెనభైమంది సంగీతం చక్కగా పాడగలిగినవారె? సోదరీ! అరవవారిని తెగపొగడుతున్నానని నీకు కోపంరావచ్చును? కానీ నిజంగా ఆంధ్రదేశంలో పేరెన్నికగన్న గాయకులున్నారుగదా? వారి నాదరించేటందుకు మన తెలుగుగడ్డలో ఎక్కడైనా ఒక్క సంగీతసమాజంగాని ఒక్కసంస్థగాని వున్నదా?

మా బెజవాడలో చూడు—తమిళులంతా జేరి ఒక సంగీతసమాజం స్థాపించి దానికి చాలామంది సభ్యులను ఆంధ్రులనేచేర్పించి అధ్యక్ష, కార్యదర్శి పదవులన్నీ అరవవారేతీసుకుని వారంవారంపాట కచ్చేరీలుగాని, హరికధలుగాని, భరతనాట్యాలుగాని యేర్పాటుజేసి దక్షిణదేశంనుండి అనేకమంది విద్వాంసులను ఆహ్వానించి సత్కరిస్తూవుంటారు. ఒకసారైనా తెలుగువారి కవకాశంయివ్వరు. మన ఆంధ్రులుమాత్రం ప్రతిపాటకచ్చేరీలకువెళ్లి అరవవారితోపాటు తాముగూడా హర్షధ్వనులుచేసే ప్రతి తెలుగువారికి తెలుసుకానీ ఒక్కరైనా ఈ విషయం అడిగినవారేరీ? మన తెలుగువారి జాత్యభిమానం యిట్లావున్నది. యికశలవు. యిప్పటికే నీకు విసుకుబుట్టవచ్చును యిదంతా చదివేటప్పటికి. మళ్ళీరాస్తాను. యిఖబాకీ పడనులే.




ఇప్పుడు నీ యొక్క సొగసైన వస్తువులనన్నిటిని నీకిష్టము వచ్చినప్పుడెల్ల పలుమారు లక్సుతో జాగ్రతగ నుంచుకొన వచ్చును. ఎందుకనిన నీ పైకమునకు ఈ పెద్ద సైజు లక్సు ఎక్కువ సోపును ఇచ్చుచున్నది. గట్టి రంగుగల పట్టు వస్త్రములను, కంబళము మొదలైన ఉన్ని వస్త్రములను చాల జాగ్రత్తగ లక్సు ఉతుకును. చల్లని నీటిలో లక్సు నురుగును ధారాళముగ నిచ్చును. నీ మలినమైనట్టి సూక్ష్మమైన వస్త్రముల లక్సు నురుగులో జాగ్రత్తగ పులిమిన, మలినమును చెమటయు పూర్తిగ తొలగిపోవును. ఎట్టి చెరుపును కలుగనీయక బాగుగ శుభ్రపరచును. చన్నీటిలో చెరుపులేక దేనిని నీవు తడపవచ్చునో వాని నన్నిటిని లక్సులో ఎట్టి హానిలేక ఉతక వచ్చును !

# క్రొత్త పెద్ద సైజు లక్సు

## కొనుటచేత నీ పైకమునకు ఎక్కువ సోపును పొందెదవు




చిన్న సైజు, సాధారణ సైజు లక్సు ప్యాకెట్లు కూడను నీ పైకమునకు గొప్ప ఆదాయము నిచ్చును.

# 'ఆమె నీడ'

శ్రీ శివరాజు వెంకటసుబ్బారావు



పురుషుడు స్త్రీలో ప్రేమించేది, ఆత్మ, హృదయం, ప్రజ్ఞ-కాదు. అతను లక్ష్యంచేసేది శరీరాన్నే. శరీరం చక్కండైతే, నీడైనా సరే అతను తృప్తిపడతాడు. శరీరంలేని ఆత్మల్ని అతడు తన నిరాదరణ, కాఠిన్యాలకి బలిగా కోరతాడు నాగరిక ప్రపంచంలో.

'బుచ్చిబాబు'



హరీంద్రనాధ్ ఛటోపాధ్యాయ జీవితనాటకాన్ని తెరవెనక నృత్యం చేసే అస్తిపంజరంకింద పోల్చాడు. ఈ వుపమానంలో ఆయన సూచించదలుచుకున్నది మానవహృదయంలో దాగివున్న అర్థంలేని భ్రాంతి-పిచ్చిని. అస్తిపంజరంయొక్క నీడల నృత్యంకింద పోల్చివుంటే దృశ్యం పూర్తిగా భయానకంగా మారివుండును. యదార్థ్య సంఘటనలు, హృదయ పరివర్తనాన్ని మార్చలేవు. కారణం? అవి యదార్థాలు గనక. ఎవ్వరికీ లభించనీ, ఎవరూ పొందకూడనీ, అగోచరమైనవాటిని ఆశించి వాటికొరకు, వర్తమానాన్ని, ప్రస్తుత కర్తవ్యాన్ని త్యాగంచేసి, అవసరమైతే మృత్యువునికూడా ఆహ్వానించడంలో మానవహృదయం అమరత గణించుకుందని అనడం. దానికి ఋజుం చేయుగలిగిన న్యాయం.

ఆ దినానికి వుద్యోగయత్నాలు ముగించి, శివాలయానికి చేరుకున్నాడు నలినీకాంతం. అతనుచేసే ఉద్యోగయత్నాలు యితరులకోసం. భార్య, పిల్లలు, సంసారం, సంఘం వాటికోసం. అతనికి వుద్యోగం చెయ్యాలన్న కోర్కె లేదు. కాని, భోజనం, పెండ్లి, ఆచారాలు, కర్మలు, వీటిని గుర్తించినట్టే, వుద్యోగాన్నికూడా గుర్తించాడు. ఈ ప్రపంచనాటకంలో నటుడుగా వుండటంకంటె, దాన్నిచూచి ఆనందించడం అతని ఆదర్శం. కాని యీ ఆదర్శాన్ని అమల్లో పెట్టుకోడానికి చేసే యత్నాలుకూడా ఓ నటనే యనిగుర్తించలేకపొయ్యాడు. యితర 'ఆదర్శ' ఆరాధకుల మాదిరిగానే. తనకు యీ జన్మలో వుద్యోగం అవదని అతనికేదో ఓ ఆశ. తీరా ఐనా నిరాకరిస్తాడేమో కూడా. ఆ ఆలయంలో కూర్చుంటే అతని దినాలుగడిచిపోవు? వుద్యోగం యెందుకు? 'ఏమండోయ్, ఏంజేస్తున్నారంటే ఫలానాపని చేస్తున్నానని చెప్పుకోడం కోసమేగా?' కాని యింట్లో భార్యా? . భార్య అమాయకురాలు. యితని వేదాంతంలో పడి యితని ఆదర్శాన్ని మెచ్చుకుని సహాయపడుతుంది. కాని అత్త, మామా, తల్లి ... వీళ్లమాట? తప్పదు, నిప్పుగుండంలో దూకడం. తప్పవు యీ సంకెళ్లు. మనం చెయ్యకలిగింది, యీ సంకెళ్లు శబ్దం చెయ్యకుండా చూడడం మాత్రమే.

రాత్రి తొమ్మిది కావొస్తోంది. ఆలయానికొచ్చిన జనప్రవాహం సన్నగిలింది. ఆలయం చుట్టూవున్న, నున్నటి యెత్తైన తెల్లటి గోడముందు నిలబడి శూన్యంవైపు చూస్తున్నాడు నళినీకాంతం. వెనక అమర్చబడ్డ పెద్దపెద్ద దీపాలు, కాగడాలు, నడిచిపొయ్యే వ్యక్తుల నీడలని గోడమీద పడేటట్లు చేస్తున్నాయి. ఆ నీడలు వికృతమైన భయంకరమైన ఆకారాలుదాల్చి, ఛటోపాధ్యాయ వుపమానంలోని అస్తిపంజరాలలాగున నృత్యంచేస్తున్నాయి. మెల్లగా కాగడాలు, వొకటి తర్వాత వొకటి ఆరడం మొదలెట్టాయి గోడమీది నీడలుకూడా వింత ఆకృతి దాల్చడం మాని నిశ్చలంగా కనపడడం మొదలెట్టాయి. వ్యక్తిని సంధ్యా

రాగంలో క్రుంగిపోయిన ఆకాశం ముందుగా నిలబెట్టినట్లుగా వుంది ఆనీడ. అది ప్రక్కకితిరిగి నిలబడివున్న స్త్రీది. చెవికున్న లోలకుకూడా కదలడం మానింది. కాళ్లు, చేతులు, చీరా - యివన్నీ నల్లటి నీడలో కలిసి పొయ్యాయి. ఆ నీడలో ఆకర్షణీయమైన ప్రక్కవైపు ముఖము (Profib) కనిపించింది. ఆ ముక్కు నుదుటి కింద సిగ్గుచేత కాబోలు వొంగి, చివరకు లోకాన్ని యెదుర్కొనేందుకు సిద్ధమైనట్లుగా పైకి తొంగిచూచింది. ఆ పెదవుల వొంకర యెప్పుడో బైటపడపొయ్యే నవ్వుని దాచుకుంది. ఆ చిన్నిగడ్డం వ్యక్తిత్వాన్ని, కీవినీ సూచిస్తుంది. నళినీకాంతంలో ఆరాధన జ్యోతి వెలిగింది. ఆ నీడను చూస్తో దినాలు గడపడం జీవితాన్ని వ్యర్థంచెయ్యడం కాదు. అది, గుహల చీకట్లో ప్రాణం నిలపెట్టుకోలేక తనయెదుట నీడగా మారిన అజంతా విగ్రహం. అతని భావాలు శూన్యంలోకి కదలడం ప్రారంభించాయి. నీడకూడా కదలి శూన్యంలోకి అంతర్ధానం కావడం అతను గుర్తించలేదు. ఆ నీడకు కర్త ఐన ఆమెను ఒక్కసారి చూస్తే ఆశాభంగం కాదు కద? అవదు. అది మానవనేత్రాల విమర్శనలకి అతీతం. తిరిగిచూశాడు. ఆ వ్యక్తి లేదు. చుట్టుపక్కల యెక్కడా స్త్రీలే లేరు. శూన్యంలో మెరుస్తున్న కడసారి కాగడా కాస్తా ఆరింది.

౨

ఆ రోజునుండి, నళినీకాంతం మనస్సు 'ఆమె నీడ'లో ఐక్యం అయింది. ఆ నీడనుచూచి భ్రమించడం భ్రాంతని అతనికి తెలుసు. ఈ లోకమే పెద్ద భ్రాంతైనపుడు, సౌందర్యమైన భ్రాంతిని వాంఛించడంలో దోషమేముంది? ఆమె వొక దేవకన్యకవలె తన నీడలో తన సౌందర్యాన్ని అతనిముందు ప్రదర్శించి, మళ్లా నిజరూపాన్ని చూపకుండా మాయమయి అతన్ని భగ్నహృదయునిగా చెయ్యడం విధి. అతనితో చెలగాటం ఆడడంలా తోచింది. అతన్ని నిరుద్యోగునిగా చెయ్యొచ్చు; వ్యాధిగ్రస్థునిగా చెయ్యొచ్చు; దుర్నీతిపరునిగా చెయ్యొచ్చు విధి - కాని అతనెంతో గౌరవించి ప్రేమించుకుంటున్న హృదయాన్ని వెక్కిరించి అతని వుద్రేకాలను పరిహసించడం విధికి తగనిపని. తను, ఆ స్త్రీని యెక్కడున్నాసరే చూచి తీరవలసిందే. మానవ హృదయ ఔన్నత్యాన్ని విధికి బుజువుపరచడానికి సంకల్పించుకున్నాడు.

అనేక సాయంకాలాలు ఆ దేవాలయం గోడముందే గడిపాడు నళినీకాంతం 'ఆమె నీడ'పై అతని అంతర్నేత్రాలు మూసుకున్నాయి. కోటినీడల భేతాళనృత్యాల మధ్యలో 'ఆమె నీడ'ను పోల్చి చూపకలడన్న ధైర్యం చిక్కింది. ఆమె నీడ గోచరించలేదు. అతని హృదయం తుపాను ముగిసింతర్వాత కొండశిఖరాలమీదనుండి జారిపొయ్యే మేఘాలవలె క్రుంగిపోతోంది. వుద్యోగం లభించినా నిరాకరించే స్థితిలోకి రాబోతున్నాడు. అతని నేత్రాలలోని వెలుగు సన్నగిలడం గుర్తించలేకపోలేదతనిభార్య. అతని నవ్వులో యత్నం వినిపించిం దామెకు. ఏదో కళ అతన్నివొదిలి వెళ్లిపోయింది. ఆ అధరాలలో అలసట, అరుచి, దూరం...ఇవన్నీ అతని భార్య తప్ప యింకెవ్వరు గుర్తించగలరు?

'మీరీమధ్య యెందుకండి అల్లా వున్నారు?' అందతని భార్య వాణి. వాణి నీడని ప్రదర్శించి భ్రమింపచేసేటంతటి రూపసి కాదు. ఆమెతో దగ్గర పరిచయం వున్నవాళ్లు చూడకలిగే సౌందర్యం లేక పోలేదు. ఆమె చక్కదనంలో స్ఫుటంగా కనిపించే లక్షణం సిగ్గు, బరువైన కనురెప్పలు పూర్తిగా పైకి వెళ్లలేవు. ఆ దంతాలు పెదవుల వొంకరలోనుండి పూర్తిగా లోకం చూపులో పడవు. ఆమె పలుకులో నిద్రమత్తుచే పాడలేకపొయ్యే కోకిలకంఠం వినిపిస్తుంది.

'నాతో చెప్పకూడదూ? ఉద్యోగం గురించా? ఎందుకు వెధవ ఉద్యోగంకోసం మీకింత బెంగ, మనకేం? మనకున్న పాతికెకరాలూ వ్యవసాయం చేసుకుంటూ, గోదావరీ తీరాన్ని పర్ణశాల నిర్మించుకుని. సాయంత్రం పడవలో పాడుకుంటూ, నీళ్లలోపడ్డ చంద్రబింబం నీడచూచుకుంటూ.........'

'నీడ' అన్న మాటదగ్గఱ వులిక్కిపడ్డాడు నళిని. 'పోనీ మీకంత కష్టంగావుంటే మాట్లాడక్లెండి...' అని వాణి మూతి బిగించుకుంది. కాని ఇది తనుమూతి బిగించుకున్నంత మాత్రాన తేలిపోయే క్షోభ కాదని వెంటనే గ్రహించుకుంది.

'ఏమిలేదు. ఊరికినే.'

'అబ్బ! చెప్పండి. చెప్పకపోతే యివాళ నే భోజనం చెయ్యను.' అని అతని ముంగురులు సవరించింది.

'ఏమీ లేదని చెప్పలా...'

'చెబుదురూ...చెపితే అక్షరానికో ముద్దు చొప్పున అర్పించుకుంటా సుంకంక్రింద...మనకి పిల్లలు లేరనా? అప్పుడే పిల్లలేమిటండి!' అని సిగ్గుతోనవ్వుకుని కనురెప్పలతో అతని నుదుర్ని తాకింది.

నళినికి చెప్పనా?వొద్దా?అని యుద్ధంచేస్తున్న రెండు మనస్సులూ వొకటి అతికాయి.గా ఈవిషయం చెపితే తప్పేముంది? భార్యకి ద్రోహంచెయ్యడం లేదుగా.

'ఐతే చెప్పనా?'

'తప్పకుండా.'

'కాని నీతో చెప్పడం భయంగావుంది. ఎవరికీ చెపితే అర్థమయ్యేది కాదు.'

'అంత మాటల్తో చెప్పలేకపోతే కాగితంమీద వ్రాయండి. తీసుకురానా కలం?'

'వొద్దు. చెప్పగలను. కాని, చెపితే ఎవరూ నమ్మరు.'

'ఇంకొకళ్ల జోలెందుకు. నే నమ్ముతాగా.'

'అదికాదు. నే పిచ్చివాడినని అనుకుంటావు.'

'నాకు పిచ్చివాళ్లంటే మరీ యిష్టం. అసలు నేనే పిచ్చదాన్నని మీరనేకసార్లన్నారు. చెప్పండి.'

'ఐతే విను. నేనో స్త్రీని చూచా.' అని, వెనక్కి జార్లపడ్డాడు, భార్య ఆశ్చర్యాన్ని యెల్లా ప్రకటిస్తుందో చూద్దామని.

'అందులో నమ్మరాంది, అర్థంలేనిదీ యేముంది?'

'ఆ స్త్రీ చాలా చక్కంది.'

'అదీ విపులంగానే వుంది.'

'కాని నేనా స్త్రీని చూడలేదు.'

'అదేమిటి, యిప్పుడేగా చూచానన్నారు; పైగా చక్కందని మెచ్చుకున్నారు....'

'అల్లాగైతే చెప్పను. చెప్పలా పిచ్చవాడిననుకుంటావని...'



'అవ్వై హోమ్' అను అనాథ బాలికా వసతిగృహము వార్షికోత్సవంనాటి దృశ్యం. గృహనిర్వాహకులు శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డి గారు మధ్య కూర్చున్నారు.



‘అన్వై హోమ్’ అనాధ బాలికా వసతిగృహంలోని పారిశ్రామిక శాఖ

'లేదు లేదు, కానీండి...కలలో చూశారా ?'

'అల్లాంటిదే, నీడ చూశాను, ఆ స్త్రీ నీడ.'

'కలలోనా, నిజంగానా ?'

'కలలో లాగే వుంటుందికాని కలగాదు. గోడమీద నీడ చూశాను. వెనక్కి తిరిగేప్పటికి మళ్లా ఆ స్త్రీ కనిపించలేదు.'

'ఏ దయ్యమేనా కాదుకద ! ఎంత కాలంక్రిందట ?'

'నాకు జ్ఞాపకంలేదు, చాలారోజులైంది.'

'అయితే యింత దిగులెందుకు ?'

'నాకు మళ్ళా కనిపించక పోవడంవల్ల నేనాదృశ్యాన్ని మరిచి పోలేను.'

వాణి నవ్వడం ప్రారంభించింది.

'నవ్వితే నాకు నొప్పికలుగుతుంది. నీ ఈర్ష్యని యీ విధంగా ప్రకటించకు. నా ఆదర్శానికి దగ్గరగా వొచ్చింది ఆమెనీడ. ఆమే, నేనూ, వొకే లోకంలో బ్రతికివున్నాం అన్న భావం నాకెంతో శాంతి నిస్తుంది.'

ఈ వాక్యాలు వాణి అమాయకపునవ్వులో భూకంపం జరిగినప్పుడు వినపడే శబ్దాన్ని వినపడేటట్లు చేశాయి.

'పోనీ యీ భావాన్ని స్మరించుకుంటూ సంతోషంగా వుండరాదు ?'

'ఒకసారి ఆ వ్యక్తిని చూసి వుంటే........' మళ్లా మౌనంలో పడింది. అతని భావ, మానవ భావలో 'అల్లా జరిగి వుంటే' అన్నది చాలా విషాదకరమైన వాక్యం.

3

ఉద్యోగ యత్నాలు చేస్తూ యీ మహాపట్నం జేరుకున్నాడు నళిని. ఈ పట్నంలో జీవం వేగంగా కదిలిపోతుంది. వుద్యోగం యిచ్చేవ్యక్తిని కలుసుగోవడమే చాలా కష్టం. ఆ వ్యక్తిని వొంటరిగా వున్నప్పుడు కలుసుకోడంలో విజయంపొందితే ఎవరెస్టు శిఖరాన్ని జయించినట్లే. నాలుగు దినాలూ ఆ బంగళాముందు వొచ్చే పొయ్యేకార్లన్ని చూస్తూ నిలబడడంలోనే గడిచాయి. ఐదోనాడు కనబడి మూడు మాసాలు గడిచింతర్వాత మళ్లాకలుసుకో మన్నాడు వుద్యోగం యిచ్చేవ్యక్తి. అదేనా అప్పుడు కనబడితే ఆలోచిస్తా నన్నాడు. ఆఖరివిన్నపం చేసుకోడానికి బంగళాలోనికి ప్రవేశించాడు సాయంత్రం యేడు గంటలకు. లోపల దీపాలు లేవు. బైటన్నీ పూలుమొక్కలూ, గుత్తుగా నిలబెట్టబడిన ఆర్చీలమీద వింత రంగులుగల క్రీపర్లూ. లోపలిగోడకి యెదురుగా గేటుమీద పెద్ద పచ్చటి ఎలెక్ట్రిక్ దీపం. మొక్కల నీడలమధ్య ఆ గోడమీద 'ఆమెనీడ' చూశాడు నళినీ దాన్నిచూసి పోల్చుకుంటూ తనచుట్టూ మొరుగుతూ గంతులేసే కుక్కనికూడా గమనించ లేదతను. దాని నీడకూడా గోడమీదపడింది. ఆ నీడలో కుక్క తోక ఆడించి, మొరిగి మళ్లా గంతులేస్తూవెళ్లిపోయింది.

ఈనీడ ఆమెనీడేయని గుర్తుపట్టగలిగాడు. కానీవ్యక్తి తనవూహకొచ్చే అవకాశాలెక్కడున్నాయి. ఈ ధనికునిబంధువు యీ నాగరిక ప్రపంచంవొదిలి శివాలయాలచుట్టూ ప్రదక్షిణాలు చెయ్యడం అసంభవం. పోనీ అడిగిచూస్తే, కోపించుకోదుకదా ? కోపించుకుంటే వొచ్చిననష్టం యేమిటి ? అతనికి వుద్యోగం రాక

పోవచ్చు పోతేం? ఈముష్టి ఏభైరూపాయలవుద్యోగం చెయ్యకపోతే దేశాని కేవిధమైన ఆపదా సంభవించదు. ప్రక్కకు తిరిగిచూశాడు. ఆ స్త్రీ వోదులుగా జెడ అల్లుకుంటూ, ఎత్తు జోళ్లమీద చప్పుడు కాకుండా హంసలా నైట్ క్వీన్ చుట్టూ విహరిస్తోంది. వయస్సు పాతికేండ్లలోపు. ఆకుపచ్చ ఎనామిల్ రాళ్ల లోలకులు ఆ మెనడకతో లయకల్పుతూ అల్లల్లాడుతున్నాయి. అతనివంక చూసింది. ఆ చూపులో పురుషుడు సమాధానం యివ్వలేని ప్రశ్న దాగివుంది. ఆమూతిబిగింపు, చిట్లించిన కనుబొమలు కిరీటంవలె నుదురుమీదకదుల్తూ, ఆ దృశ్యంలో ఆహ్వానం యిముడివుంది. ఎన్నోవిధాలు తర్కించిన అతనిమనస్సు అతన్ని కార్యానికి పురిగొల్పింది. మొదట ఖంగారుగా మాట్లాడబోయ్యాడు. కాలి బొటనవ్రేలితో నేల మీద అంకెలుగీచి, పైకి చూచేటప్పటికి, అతనిముందు నిలబడివుంది.

'ఎవరికోసం?'

తను ఫలానాపనికోసం వొచ్చాననీ, తనది ఫలానాఊరనీ చెప్పాడు. ధైర్యంచేసి, వుద్యోగాల వ్యక్తి ఆమెకు తండ్రేనా అనికూడా ప్రశ్నించాడు.

'అవును.'

ఆమెకు వివాహం అయిందాఅని అడగబొయ్యాడు. ఆప్రశ్న ప్రమాదమైంది. అసలు ముందు శివాలయంమీద నీడ ప్రసరించింది యీవిడో కాదో తెలుసుకోవాలిగా. అది నిజమని తేల్తే, ఆమె జీవిత చరిత్ర తెలుసుకోడంలో అర్థం, పరమార్థం వున్నాయి.

'మీరెప్పుడేనా మావూరొచ్చారా?'

'ఏవూరు?'

మళ్లా ఫలానా ఊరనిచెప్పాడు.

'లేదు.'

'లేదూ?'

'లేదు, లేదు.'

అనుమానంలేకుండా తేలిపోయింది, యీమె కాదని. ఓవేళ మరిచిపోయి వుండకూడదూ?

'మీ కులదైవం యెవ్వరు?'

'ఎందుకు?'

'కుతూహలంవల్ల అడిగాను, క్షమించండి.'

ఈవ్యక్తి తనదైవంమీద కుతూహలంచూపడం, తనమీద కుతూహలం చూపడంలాగే భావించుకుంది.

'ఫరవాలేదు. ఇందులో క్షమించడానికేముంది. ఏమిటి మీరడిగింది'?

'మీరు, మీవారు పూజించేదైవం యెవ్వరు'?

'విష్ణువు.'

'శివుడు కాదన్నమాట'

'ఫలానాఅని గట్టిగా నాకు తెలియదు. ఏదో వుజ్జాయింపుగా చెప్పాను.'

'ఎప్పుడేనా యేవూరేనా వెళ్లినప్పుడు, శివాలయానికి వెళ్లారా'?

'లేదు. లేదు'.

'పో, ఏ ఆలయానికైనాసరే వెళ్ళారా'?

ఆ స్త్రీకి నవ్వు, ఆశ్చర్యంకూడా వొచ్చాయి. గంతులేసే కుక్కపిల్లను యెత్తుకుని దాని వీపుమీద వేళ్ళతో రాస్తూ అతనివేపు కీవిగాచూస్తూ, ఆదరణచూపింది దృష్టిలో.

'నే నెప్పుడూ యేగుడికీ వెళ్ళలేదు. మీ ప్రశ్నలు చాలావింతగా వున్నాయి.'

'నాకుతెలుసు నన్ను క్షమించాలి. మీరన్యథా అనుకోకుండావుంటే నేను మీకు సమాధానం చెప్పగలను.'

'ఫరవాలేదు చెప్పండి...ఓరే 'నారీ' ఆ గేటుముయ్యి.' నారీ గేటుమూసి నిష్క్రమించాడు.

'నేను మాఊరి శివాలయంగోడమీద ఓ స్త్రీనీడ చూశాను. అదిచాలా ఆకర్షణీయమైంది. వెనక్కి తిరిగేప్పుడికి ఆమెమళ్ళా కనుపించలేదు. ఆనీడని నేపోల్చగలను. ఈనాటివరకూ మళ్ళా ఆమెనికాని ఆమె నీడనికాని చూడలేకపోయాను. అదృష్టవశాత్తు యీనాడే గోడమీద మీనీడచూసి ఆమెదేనని పోల్చుకున్నా. కాని, మీరుచెప్పినదానివల్ల నిజంకాదని తెలుసుకుని నిరాశచెందా. నిరాశచెందినా, మిమ్మల్ని, చూడడం పూర్తి నిరాశకాదు.' ఈ వాక్యాలు, ముఖ్యంగా చివరివాక్యం ఆమెలోదాగివున్న స్వార్థాన్ని, 'నేను-చక్కందానినైనా-నన్నెవరూ-గమనించడంలేదు –' అన్నభావం చెలరేగి, యితనిమీద వొక చెప్పరాని స్నేహభావం యేర్పర్చుకుంది. తన నాగరికప్రపంచంఅంతా నటనతోనూ, పైపైమెరుగులతోనూ, పాశ్చాత్య సాంఘికాచారాలతోనూ, కపటాలతోనూ నిండివుంది. అందులో ఆమెకులోతైన జీవం కనపడలేదు. మట్టికి బంధువైన కవిత్వంలోవున్న పిచ్చి, వున్మాదాన్ని తనశరీరం తాకలేదు. ఆనాటివరకూ తన హృదయాన్నివిప్పి అరిచేతులోపెట్టిన భాషనే వినలేదు. పాడుపడి తుప్పుపట్టిన నరాలకుప్ప మధ్య అతను సౌందర్యానికి చేసిన సంబోధన మారుమ్రోగింది. నాగరికతజీర్ణించి నీరసించిన ఇంద్రియాలు చెలరేగి చిందులు తొక్కాయి.

'అల్లాగా ?' అనగలిగింది ఆశ్చర్యంతో. కొంతసేపు నిశ్శబ్దం-కుక్క-నాలుక బైటపడవేసి చేసే రొదమాత్రం వినిపిస్తూంది.

'నా సాహసాన్ని మన్నించాలి' అన్నాడు.

'అహ, లేదు, కాదు, -ఫరవాలేదు...నిజంగానా ?'

ఈ మాటలలో అర్థంలేకపోయినా ఆతృత, సూక్ష్మమైనప్రియత్వం వినగలిగాడు. నైట్ క్వీన్ లోంచివొచ్చే సువాసన ఆమె ఫేస్ పౌడర్ వాసనలోకలసి అతన్ని ఆవరించింది.

'పాపం, మీకానీడనుచూస్తే అంత సంతోషమే...' తరవాత మాట్లాడలేకపోయింది. కార్ హారన్ వినిపించడం గేటు తెరవబడడం జరిగాయి.

తలవని తలంపుగా అతనికి ఉద్యోగం లభించింది. దీనికి కారకురాలు, తను ఆనాడు బంగళాలో మాట్లాడిన ఉద్యోగాలాయని కూతురని అతను గ్రహించుకున్నాడు. ఈ ఏభైరూపాయల వుద్యోగానికి, వికసించే ఆత్మలని చంపుకుని, ఆత్మహత్య యత్నాలని ముగించి యెగపడేవారు, మన దేశంలో వేలకివేల మంది వున్నారు. కాని యీ దౌర్భాగ్యుడికి మాత్రం యీ వుద్యోగం సంతోషం యివ్వలేకపోయింది. నిశ్చింతగా సాగిపొయ్యే అతని జీవనానికి, అతని పిచ్చి ఆదర్శం అడ్డుతగిలి తనమీద ఆధారపడే వారి

జీవితాన్నికూడా దుర్భరరగా జేసింది. నిర్మలమైన ఆకాశంమీద, 'ఆమె నీడ' పెద్ద భయంకరమేఘంగా కప్పింది. ఆమె సౌందర్యాన్ని మెచ్చుకోడంవల్ల కదా యీ వుద్యోగం యిప్పించ గలిగింది! ఆనాడు, ఆమెను తిట్టివుంటే—నిజంగా అతను మోసపోయ్యాడని, ఆశాభంగం జరిగిందనీ చెప్పివుంటే...యెంత గౌరవంగా వుండును! ఈ ఉద్యోగం రాకపోను కదా. ఆమెకీ సంగతి చెపుతూ లేఖ వ్రాద్దామనుకున్నాడు.

'ఆదినం మీ నీడ'ని చూసి 'ఆమె నీడ'ని భ్రమించాను. ఎందుకో తెలియదు. అది పొరపాటు. ఆమె నీడకీ మీదానికి పోలికేలేదు. ఆమెనీడ చాలా అందమైనది. మిమ్మల్నిచూసి భంగపడ్డాను...' ఈ ఉత్తరం సులభంగా వ్రాయగలిగాడు; అంత సులభంగానూ చించివేశాడు.

అతనప్పుడే ఉద్యోగంలో ప్రవేశించి ఆరుమాసాలైంది. శెలవుదినాలకి యింటికొచ్చాడు. అల వాటుప్రకారం ఆరోజు సాయంత్రంకూడా శివాలయానికెళ్ళాడు. మళ్లా ఆగోడముందే, ఆ దీపాలే, ఆ నీడలే—అన్నీ ఆనాటి దృశ్యమే. వైకుంఠ పాళి పటాలు అమ్మడానికి ప్రయత్నిస్తున్న వొక పిల్లాడినీడ ఆగోడమీద పడింది.

'మీను పటాలు కావాలా?' అని పిల్లాడు.

'వొద్దు; ఇవి ఆడాళ్లకి కాని మొగాళ్లకెందుకురా—పోయి వేరేచోట అమ్ముకో' అన్నాడు నళినీ వాడి నటన గోడమీద చూస్తూ. వాడు మళ్లా సిద్ధమయ్యాడు.

'ఇంట్లో అమ్మగారు ఆడుకుంటారు తీసికెళ్లండి.'

'పోరా వెధవా...అమ్మగారు లేదు అయ్యగారులేరు.'

'అదేంటండీ, మీరేగా అయ్యగారు. సవకండి పఠంకానీ...'

'పోతావాపోవా...ఉండు చూడనీ.' అని గోడమీద నడిచివొచ్చే స్త్రీ రూపాం చూశాడు.

'సవకండీ...'

ఆమెనీడ యీ పిల్లాడినీడలో మరుగుపడింది.

'దూరంగా నిలబడ్రా, వో కానీ యిచ్చుకుంటాను...' అన్నాడు. పాపం, ఆపిల్లాడికి యితని చిరాకుకి కారణంయేం తెలుస్తుంది?

'మీరడిగారు కాబట్టి కానీకి రెండు...' పిల్లాడు కదిలాడు చివ్వరికి, రెండుపఠాలూ అర్పించి. సత్యమైన 'ఆమెనీడ'ని గోడమీద చూడగలిగాడు నళినీ. ఆముక్కు, ఆపెదవుల వొంకర, ఆ అల్లల్లాడి ఆగిపొయ్యే లోలాకులు, ఆ రాణీహోదాని సాటించే ఆగడ్డం,—అంతా ఆమెనీడే. నీడ నిలిచింది; నిశ్చలంగా అజంతా విగ్రహంలా గోడమీద అమర్చబడింది.

'బాబు గోరూ, యిందాకా మీ కిచ్చింది వొకటా? రెండు పఠాలాండి?' మళ్లా పిల్లాడు సిద్ధమయ్యాడు. 'ఎన్నోకొన్ని—వుండు చూడనీరా...' పిల్లాడు. ఆశ్చర్యంతో గోడవంకచూడడం మొదలెట్టాడు. నళినీ హృదయం సంతోషంతో పొంగి పొరలింది. ఆ పిల్లాడికి మరో కాని యిద్దామనిపించింది. వైకుంఠ పాళీని కొన్నాడు; వైకుంఠాన్ని చూడబోతున్నాడు. పక్కకి తిరిగి చూశాడు.

కళ్లు నలిపి మళ్లా జాగ్రత్తగా తేచిచూచాడు. గోడమీద మళ్లాచూసి పోల్చుకున్నాడు...మళ్లా మళ్లా చూశాడు...ఎవ్వరు? నిజమే? అవును, నిస్సందేహంగా,...అతని భార్యవాణి. అతని భార్యే 'ఆమె నీడ' సృష్టికర్త నిజంగా జీవితనాటకం, తెరవెనక నాట్యమాడే అస్థిపంజరాల నీడే.

# భారతీయనారి



శ్రీ స్వామి వివేకానంద

అనువాదం : శ్రీ పూర్ణానంద

(సెప్టెంబరు సంచిక తరువాయి)

అందువలన, భారతీయుని సాంఘిక-ఆచారముల పునాది ఎయ్యదిి? ఆ మూలము వర్ణాశ్రమములు. నా జన్మ, జీవితము నేను చెందిన వర్ణమునకు. ఇచ్చట నేను స్వవిషయమును జెప్పుచుండుటలేదు. కారణము, సంన్యాసి సాంప్రదాయమున జేరుటవలన నేను వర్ణమున (జాతి) కతీతుడ నైతిని. ఎవరే వర్ణమున జన్మింతురో వారా వర్ణముయొక్క శాసనమునకు, ఆ జీవితమున తలయొగ్గి మెలగవలెను. అనగా, మీయొక్క ఆధునిక భాషలో చెప్పవలెనన్న, పాశ్చాత్యుడు జన్మాదిగ స్వతంత్రుడు, తనకొఱకే; కాని భారతవాసి సంఘ తంత్రుడు-సంపూర్ణముగ సోషలిష్టు. (అనగా పాశ్చాత్యుని జీవితము కేవలము తనకొఱకే; హిందువుల జీవితము సంఘము కొఱకు.) అని శాస్త్రము వచించుచున్నది— నేను పురుషుని యథేచ్ఛావివాహ-స్వాతంత్ర్య మొసగిన ఫలిత మెట్టుండును? నీవు ప్రేమించితివి సరే, కాని, రమణియొక్క పిత పిచ్చివాడో లేక త్రాగుబోతో యైన ఏమి చేయవలెను? ఒకానొక బాలిక ఒకానొక పురుషుని రూపమునుగాంచి మోహమును గొన్నది, కాని అతని తండ్రి మద్యపాయి. ఈ విషయమున విధియేమి? ఈ వివాహములన్నియును నిషేధనీయములు. మద్యపాయి, యక్ష్మరోగి, ఉన్మాదుల సంతానముయొక్క వివాహము లసంగతములు. షండు, కుబ్జ, ఉన్మత్త, మూఢుల వివాహములు ఎన్నటికిని జరుగగూడదని శాస్త్రమతము.

ముసల్మాను లరుదెంచినారు; వారి భూమినుండి వారు అరేబియా విధులను దీసికొనివచ్చి ఆ మయ శాసనముల మా నెత్తిన రుద్దినారు. మేము జయింపబడితిమి! ఇంక మే మేమి చేయగలము? ఎంతదూర సంపర్కమేయైనను సగోత్ర వివాహము తగదని శాస్త్రము. దీనివలన శారీరక అవనతి, వంధ్యాత్వములు అనివార్యములు. ఇయ్యది సంపూర్ణముగ అనుచితము; అందువలన మా శాస్త్రము ఈ వివాహమును నిషేధించినది. వివాహ విషయమున నాయొక్క లేక నా సోదరియొక్క మాట చెల్లదు. ఈ విషయమున వర్ణమే అందఱియొక్క నియంత. కొన్నిపట్ల శైశవముననే మా దేశమున వివాహ మొనర్పబడును—వర్ణముయొక్క నిర్దేశము ననుసరించి ఏలయన, ఇష్టానిష్టముల నపేక్షింపక వివాహము నొనర్పవలసియున్న, ప్రణయప్రవృత్తి అంకురింపకమున్నే, బాల్యకాలముననే వివాహ మొనర్చుట మంచిది. చిన్నదనముననే వివాహమొనర్పక బాలబాలికల స్వతంత్రభావమున ఇంటనుంచిన, వారు వర్ణము వివాహమొనర్ప అనుమోదింపనివారిపట్ల సక్తిని గొనవచ్చును. దాన అనర్థముకలుగును. అందువలన, దానిని మొదటనే ఆపుటమంచిది. బాల్యముననే వివాహమైన బాలబాలికల ప్రేమ, రూపగుణములపై నాధారపడక స్వాభావికమగును. అయితే మీరు నుడువగలరు—"పరస్పరము ప్రేమించి స్త్రీపురుషు లే యపూర్వభావము నాస్వాదించుచున్నారో, దానియందొకింతయు వారి భాగ్యమున బడజాలదు. అభ్యాసము, సంగగుణమున నలవడు సోదరీసోదరుల ప్రేమ అత్యంతశుష్కము" హిందువుడనునది అయిన అవవచ్చును, కానిమేము సంఘ-తంత్రులము (Socialist) "ఒక యువతి లేక పురుషుని విలాసము కొఱకు వందలకొలది మనుష్యుల భుజములమీద దుఃఖభారమును దింపజాలను."

అందువలన ఇట్లు సంఘాదేశమున అల్పవయస్సుననే పరస్పర ఇష్టానిష్టముల నపేక్షింపకయే బాలబాలికలవివాహ మొనర్పబడును. భార్య పతియొక్క గృహమున కఱుదెంచినప్పుడు వారి ద్వితీయ వివాహమైనదని చెప్పబడును (పునస్సంధానము) బాల్యకాలము నందలి వివాహము ప్రథమ వివాహమందురు.

అప్పుడుబాలిక తల్లిదండ్రులతోడను, ఇంటియందలి స్త్రీల తోడనుగలసి పితృ గృహమునందే యుండును. యుక్త వయస్సు వచ్చినప్పుడు ద్వితీయ వివాహ మొనర్పబడును. అనంతర మామె భర్తృ గృహమున అత్త మామల అధీనమై వారితో నివసించును. ఈ వధువు సంతాన ప్రసవానంతరము గృహిణియగును.

ఈ తడవ భారతవాసియొక్క విశేష ఆచారమును, చిరవైధవ్య వ్రతమును పేర్కొందును. ఉచ్చ వర్ణ (ద్వయ) ములమధ్య విధవా వివాహములేదు; ఇష్టమున్నను వారు ఒనర్పజాలరు. అవశ్యమిది చాల మందికి కష్టకరము. విధవ లందరును దీని నామోదింతురని చెప్పవీలుపడదు. ఏలయన, వైధవ్యమున వారు బ్రహ్మచర్యమును మన్నించి మెలగవలసియున్నది. మత్స్య, మాంస, మద్యము బ్రహ్మచారులకు నిషిద్ధములు. ధవళవస్త్రముగాక ఇతరముల ధరింపవీలుపడదు. ఇంకను ఇట్టివేయగు నియమములున్నవి. మా జాతి సన్యాసుల జాతి (వంశము) కేవలము తపస్సు ఒనర్చుటయేమాపని, దానినే ప్రేమింతుము. మాయువతులు ఎన్నడును మద్య మాంసముల సేవింపరు. విద్యార్థి దశయందు బాలకుల కీ బ్రహ్మచర్యము అత్యంత కష్టకరమే కాని, యువతులకుగాదు. మాంసభోజనము చెడుగని వారు తలంతురు. కొన్ని సాంప్రదాయముల పురుషులు కాని స్త్రీలు తినరు. అయినను, విధవను వివాహమొనర్పకుండ నుంచుట చాలమందికి కష్టకరమను మాట సత్యము. కాని, మనము మరల ఆ పూర్వవిషయమును స్మరణకు దెచ్చుకొన వలసియున్నది. హిందువులు సంపూర్ణముగ సంఘ - తంత్రులు.

ప్రతిదేశముయొక్క 'జనాభా' సంఖ్యలో కనబడునది, ఉచ్చవర్ణముల పురుషుల సంఖ్యకంటె స్త్రీలసంఖ్య ఎక్కుడు. ఉన్నతవర్ణములందలి నారులు పురుషానుక్రమముగ జీవితమును సౌఖ్యముగ గడుపుచున్నారు. ఇంక పురుషులమాట ఏమి? వారి బ్రతుకు ఈగలవంటిది. జనాభాలెక్కల వలన తేలునది, ఉన్నతవర్ణముల ఆడుపిల్లల సంఖ్య అతిశీఘ్రముగానే మగపిల్లల సంఖ్య నతిక్రమించుచున్నది. కేవలము వర్తమాన కాలమున. వారు మగపిల్లలవలె పరిశ్రమించుట జేసి దీనికి వ్యతిక్రమము కనబడుచున్నది. నిమ్న వర్ణములకంటె ఉచ్చవర్ణముల ఆడపిల్లల సంఖ్య చాల ఎక్కుడు. ఏలయన, నిమ్న వర్ణములస్థితి సంపూర్ణముగ విపరీతము. వారందరును కఠోరపరిశ్రమ నొనర్తురు. అదియునుగాక చాల పట్ల ఆడువారు కొంచెమెక్కుడుగ పరిశ్రమింప వలసి యుండును; గృహ - కార్యము వారి భుజములమీద. భారతదేశమున నిమ్నవర్ణముల స్త్రీలు కొంచె మెక్కుడుగ పాటుపడవలసి యున్నది. కాని పాశ్చాత్యదేశమునందలి కొన్నితావులనుండు బీద స్త్రీలతో బోల్చిచూచిన వారి జీవితము ఆపేక్షకముగ సుఖకరము. అమెరికన్ పర్యటకుడగు మార్క్ ట్వైమెన్ యొక్క భారతభ్రమణాభిజ్ఞతనుండి వారియొక్క ఈ పరిచయము లభింపగలదు. ఆయన విలికించెను; 'పాశ్చాత్య సమాలోచకులు హిందువుల రీతినీతుల గురించి ఎట్లునుడివిన నుడువుదురుగాక, కాని, నేనక్కడ, యూరప్‌నందలి కొన్ని దేశములవలె వారు వారి యువతులను నాగలి - ఎద్దులేక బండిలాగు కుక్కలతో జోడించుట, గాంచలేదు. భారతదేశమున నేను ఏ రమణియులేక బాలికయు కృషి కార్యము నొనర్చుట నెన్నడును జూడలేదు. రైలుంలైను కిరుప్రక్కల, ఎట్టఎదుట శ్యామవర్ణులగు పురుషులు బాలకులునగ్నశరీరులై కృషి నొనర్చుచుండుట కాననగును. కాని స్త్రీవ్యక్తి ఒక్కటియును కనుపించలేదు. ఈ రెండు ఘంటలలో నాకొక్క స్త్రీవ్యక్తిలేక బాలికగాని పని నొనర్చునట్లు కనుపింపలేదు.' భారతదేశమున నిమ్నతరజాతి స్త్రీలుగూడ ఎన్నడును మిక్కుటముగ కష్టకరమగు పరిశ్రమ నొనర్పరు. ఇతర దేశముల నిమ్న జాతులకంటె భారతమునందలి ఈ శ్రేణికిజెందిన స్త్రీల కార్య మత్యంత సహజము. కృష్యాదికము వారొప్పనే మొనర్పరు. అయినను ఉచ్చవర్ణముల స్త్రీల జీవితముకంటె వారిజీవితము కఠోరము. ఇప్పుడు గ్రహించితిరా! పూర్వోక్త కారణమున భారతమున నిమ్నశ్రేణి నారుల సంఖ్యకంటె పురుషుల సంఖ్య అధికము; తేలు ఫలితాంశము; పురుషుల సంఖ్య అధికమగుటవలన స్త్రీలు వివాహమొనర్చుకొను సుయోగమును అధికముగ పొందుదురు.

(సశేషము)

# సర్వనాశనమా! — సర్వోదయమా!!

'దసరాసంచిక'లో యీ పై మకుటంతో ప్రకటింపబడిన శ్రీమతి కె. సుగుణమణిగారివ్యాసముపై నవంబరు సంచికలోని 'వసంత'గారి విమర్శన వ్యాసానికి ఇది శ్రీ సుగుణమణిగారి ప్రతివిమర్శన వ్యాసము. శ్రీమతి సుగుణమణిగారి అముద్రిత, అసంపూర్తి వ్యాసము, వారి విమర్శన వ్యాసము, రెండూ చేరి, ఇది 'సమాప్తి' వ్యాసంగా ప్రకటింపబడింది. విషయపరిశీలనకీ, వివేకవికాసానికీ దోహదమునిస్తూ సుహృద్భావముతో ఇరువురు రచయితలు యీ విషయముపై విజ్ఞానచర్చ సాగించినందుకు మా కృతజ్ఞత.

సంపాదకుడు.

'...మానవుఁడు ఆధ్యాత్మికశక్తియొక్క 'ప్రియసృష్టి' అనే వూహించాలి. 'ఇది మానవునకున్న అహంకార'మని విమర్శకులంటే నే నంగీకరించను. అది అహంకారమని ఒకవేళ ఒప్పుకొన్నా - సహేతుకమైన అహంకారమేనని నేనంటాను ఆ అహంకారం వుండాలంటాను. అందులోనేవుంది మానవజన్మ యొక్క ఘనత. చిన్న ఉదాహరణయిస్తాను :- నేను భారతదేశంలో జన్మించేనని - హిందూ వనితనని - నేను గర్విస్తున్నా. నా ఘనతఇట్టిది, నాపూర్వమిట్టిది, నా దేశచరిత్ర ఇట్టిదని నేను సగర్వంగా, అహంభావంతోటే వచించగల ఈ అహంభావం సహేతుకమైనదంటాను. అలాగే ఒకప్పుడు జీవరహితంగానున్న పదార్థం వృక్షమై, జంతువై, మానవుడై ఇదమిత్థమని గ్రహించగల వివేకంగలిగి - తనకు, సృష్టికి, సృష్టికర్తకుగల భిన్నత్వ ఏకత్వాలను గ్రహించగలశక్తి, 'ఆత్మవత్సర్వభూతాని' అన్న అఖండసత్యం చవిచూడగల సామర్థ్యంగలిగినప్పుడు - తన చిన్నబుర్రతో అండపిండబ్రహ్మాండాలను లెక్కలుకట్టి, వాటి వాస్తవికతను గ్రహించి, వాటిని తనలో ఇముడ్చుకోగల సామర్థ్యంగలిగినప్పుడు - మానవుఁడు, 'నేను సృష్టిలో ఇంతవరకు తయారైన ఏగొప్ప నెబ్యులా (nebula) కన్నను, ఏ వస్తువుకన్నను, ఏజీవికన్నను గొప్పవాడను' అని అహంకారం పొందటంలో తప్పేమీ లేదంటాను. అలా పొందకపోతే తనగొప్ప తానెరుగని పశుప్రాయుడనాలి. 'What is man but a sleeping giant' అని శ్రీ వివేకానందస్వామి, 'My Father and I are one' అని జీసస్సు, 'మానవజన్మ మహత్తర పూర్ణమైనద'ని పెద్దలు ఎందుకన్నారు? ఇంకా ప్రాజ్ఞులేమన్నారో చూడండి :—

> 'In the universe there is nothing great but man,
> In man there is nothing great but mind,
> In mind there is nothing great but grace,
> And grace is True Divinity.'

మానవులోనున్న ఆ 'అహం' ఏమిటి? జడపదార్థంగానున్న ద్రవ్యం - జీవరూపంతో ఆడి, మానవజన్మతో తన్నుతా తెలుసుకొని నిర్వాణదశ పొందుతున్నప్పుడు - 'అహం,' 'సోహం' కాక మరేమిటి? 'తన్నుదా నెరిగిన సర్వము నెరుంగు'నన్న వేమనార్యునిపల్కుల ప్రకారం మానవునకు 'అహంకారం' (అంటే అజ్ఞానంతోగూడింది కాక, జ్ఞానయుక్తమైన అహంకారం) కలిగితే తప్పేముంది? ఈమాదిరి అహంకారం జ్ఞానయుక్తమైనదైతే వినయాన్ని వివేకాన్ని పెంపొందజేస్తుంది. తామసయుక్తం మాత్రం కాకూడదు.

అసలు యీ అనంతంగాతోచే విశ్వమేచిత్రం! దానిలో యెక్కడా పొడకట్టని 'జీవం' అనబడే అపూర్వం యీచిన్న భూగోళంమీద ఉద్భవంకావడం చిత్రంలోచిత్రం!! అలాంటి జీవులన్నింటికంటె ఉత్కృష్టమైన మానవజీవి కడకు తయారవడం అంతకన్నాచిత్రం!!! వాని చిన్నబుర్రకు (మనస్సుకు) స్థల వస్తు నిర్దేశాలుగావించి - అండపిండ బ్రహ్మాండాలన్నిటికి లెక్కలుకట్టగల సామర్థ్యం కలగడం చిత్రాతివిచిత్రమైన విషయం!!!! పాశ్చాత్త్య శాస్త్రజ్ఞులు యిలాంటి అఖండ ప్రజ్ఞగలవింత 'జీవం' చిత్రపు 'మనిషి'కూడ కేవలం భౌతికనియమాల ననుసరించే కలిగినట్లు చెప్పడమున్ను, వీటి ఉద్భవం 'ప్రమాదవశంవల్ల', లేక 'ప్రకృతి పదార్థాలకు యేదైనారోగం రావడంవల్లనేమో!' ననడమున్ను చాల హాస్యాస్పదంగావుంది: ఇట్టి సజీవాలేకాకుండా చింతనా సామర్థ్యంగల వృక్షాలు, జంతువులూ, వివేకజ్ఞానంగల మానవుడూకూడ 'నిర్హేతుకంగా' సృష్టిలో తయారయేరంటే విశ్వాజనీయంగాలేదు. నిజంగాచూస్తే - సృష్టిలోని యెంతటి గొప్ప నక్షత్రమండలంతోగాని, నెబ్యులా (Nebula) తోగాని పోల్చిచూచినా-'మనస్సుతోగూడిన మానవశరీరం' వంటి అపూర్వసృష్టిచిత్రం మింకొకటి కానరాదనాలి. పంచేంద్రియ సమన్వితమైన శరీరాన్ని సరికరంగా చేసుకొని మనస్సు నియమించిన, [illegible] - విషయజాలమే మనం వినేది, కనేది, ఆనందించేది, 'విజ్ఞానం' అనుకొనేది, విశ్వం అనుకొనేది - అంతా [illegible]!

[illegible] విమర్శకులు 'సృష్టికర్త' (లేదా 'విశ్వయానవ విలాసాలకు హేతుభూతమైన 'శక్తి')' యొక్క యుక్తిశక్తి ప్రశ్నిస్తున్నారు, 'ముందుగ యుగాలుగా కృషిచేసి - శక్తిని ద్రవ్యరూపంగా మార్చి, దానికి జీవంపోసి, చివరకు చిత్రాతిచిత్ర విచిత్రమైన మానవజీవిని సృష్టించి, దానికొక అపూర్వమైన మనస్సును తోడిచ్చి, అతనిచే శరీరక మానసికకర్మలు జేయించి, వాటిఫల మనుభవింపజేసి, కట్టకడకు తన్ను దా నెరుగుకొనే సామర్థ్యం కలుగజేయడంలో సృష్టికర్తకుగల ఉద్దేశంఏమి? ఈ తంతులీల, లేక పోవడమే వాంఛనీయముగదా?' యని అంటారు విమర్శకులు. ఇది భాగవతంలో............'ఏకత్వమున నుండు నీశ్వరుండు భిన్నమూర్తియగుచుఁ బెక్కువిధంబుల, నేలయుండు? అతనికేమివచ్చె నుండకున్న? తాపసోత్తమ, తెలుపవే! వేడ్కన్............' అన్న పరీక్షితుని ప్రశ్నవలె సృష్టికర్త సృష్టిహేతువునే ప్రశ్నిస్తూవుంది. దీనికి జవాబు విమర్శకులు భాగవతాది గ్రంథాలు పరికిస్తే కానవచ్చు. మానవుడు తనబుద్ధిని వుపయోగించి ప్రకృతి శాస్త్రాలు తయారుచేసేడు :- గురుత్వాకర్షణ నియమాన్ని (Law fo Gravitation,) సాపేక్షి సిద్ధాంతాన్ని (Relativity Theory), వితంతు శబవాహ కతారాయంత్రాన్ని (Wireless), టెలివిజాన్ని (Television), ఆకాశవిమానాన్ని (Aeroplane) యెన్నెన్నో కనిపెట్టేడు.

['మా పూర్వులుకూడ ఆకాశగమనం, దివ్యదృష్టి, దూరదృష్టి యిత్యాదులు సాధించేరని' భారతీయులనవచ్చు. కాని, అవి మనోసిద్ధి, వాక్సిద్ధిగల ఏ ఒకరిద్దరికో, వారి శిష్యులకో తప్ప యిప్పటివలె ఏ జర్రివెంగళప్ప కావలిస్తే ఆ వెంగళప్ప ఉపయోగించగలిగే లాగున లబ్ధములుగాలేదని యిప్పటిశాస్త్రజ్ఞులంటారు.] పూర్వమెప్పుడో రాక్షసరాజు పంచభూతములగు నీరు, అగ్ని, వాయువు మున్నగు వాటిచేత ఊడిగాలు చేయించుకొన్నాడని విన్నాంగాని యిప్పుడు పాశ్చాత్తులు వాటిని మానవసేవ చేయమని బాగా శాసించి, నీరును, అగ్నిని రైళ్లు నడపమని, వాయువును తన్ను ఆకాశంలోనికి గాండోలాతో యెత్తమని, ఆకాశాన్ని యీదర్ తరంగాలతో తనకు వార్తావాహునిని కమ్మని, ఇలా యెన్నైనా సేవలుచేయించుడం ప్రత్యక్షంగా చూస్తూన్నాం. శాస్త్రజ్ఞులు యీమధ్య యింద్రజిత్తులాగ మేఘాలలోకెగిరి వర్షాలుకూడ కురిపించేరు.

# సర్వనాశనమా! - సర్వోదయమా!!

అలా అన్నారని - తనకు తెలియదని, తెలియలేదని, తెలిసినదంతా మిథ్యయని ఊరుకుంటాడా అంతటితో మానవుడు! అలా ఊరుకుంటే తతిమ్మా జంతువులకంటె తనకున్న ప్రజ్ఞయేదీ? ఊరుకోనక ప్రయత్నించడంలోనే మానవుని అద్భుత జిజ్ఞాస వ్యక్తమౌతుంది!

అలా వూరుకోనక శాస్త్రజ్ఞులు పరిశోధనలు మొదలిడి ప్రకృతి రహస్యాలు చాలా చాలా తెలిసికొన్నారు; చాలా వింతలు సాధించేరు. కాని కష్టపడి సేకరించిన విజ్ఞానాన్ని మారణక్రియలకు వినియోగిస్తూ యెంతసద్వినియోగ పరుస్తున్నారో చూడవలెనంటే పాశ్చాత్య 'నాగరకత' దేశాలుచూచి గ్రహింపవచ్చు! అదిగాక కొన్ని కొన్ని సమగ్ర దృష్టితో వీక్షించి చెప్పలేక పోయేరు. చెప్పినవి కొన్ని అసందర్భంగాకూడ వున్నాయి. వారు ప్రతీదీ ప్రాపంచిక విషయాలకే అంటగట్టే క్రమంచూస్తే-'భౌతికశాస్త్రజ్ఞులు' అనేపదం సార్థక్యపరచేరా యనిపిస్తుంది. అలాంటి అసందర్భ విషయాలు రెండు యీ క్రింద పరిశీలిద్దాం. (1) వారు సృష్టిలోని సర్వవస్తువులూ జీవరాసులతో సహా 'కొన్ని భౌతిక నియమములననుసరించి కాలగర్భంలో క్రమంగా వికాసమునందినవని' (Inorganic and Organic Evolution) వర్ణించేరు; (2) యిలా వికాసమును పొంది పొంది కడకు సర్వము_అవిలంఘనీయములగు భౌతికనియమములకు లోనైపోయి_'సర్వనాశన' మైపోతుందని జ్యోతిషం చెప్పేరు.

ప్రకృతినియమాలను తనయూహాశక్తిని ఆధారంగాజేసికొని మానవుడు_కోట్లకోట్ల మైళ్ల దూరాలనున్న నక్షత్రలోకాల నిర్మాణాలను బైటపెట్టేడు; వాటిశీతోష్ణ పరిస్థితులను జెప్పి వయస్సులు నిర్ణయించేడు. పరమాణు (Atom) గర్భంలోదూరి వాటిరహస్యాలు సోధించేడు. కాస్మిక్ కిరణాల (Cosmic rays) కనుకున్నాడు. అణువులుగాలించి, క్షకిరణ విసర్జనశక్తి (Radio activity) గలధాతువులను కనిపెట్టేడు. 'దాసెత్తిచ్చి కరిగిపోసిని యిత్తడి బంగారుమౌనే?' అని యీ మీదట యెవరూసాహసంతో ననలేకుండా ఒకధాతువు (Element)ను మరొకధాతువుగా మార్చవచ్చు నన్నాడు. 'ఉ' అని అశబ్దాన్ని చిటికలో భూగోళం చుట్టూ త్రిప్పి రప్పించి పట్టుకున్నాడు. జీవంఅనేది యెప్పుడు, యెట్లుగా వుత్పత్తిచెందినది చెప్పేడు. యుగయుగాలక్రితం బ్రతికిన ఆదిమవాసుల యుదంతం చూచినట్లే యేకరువుపెట్టి మానవజాతి వికాసాన్ని (Evolution) విమర్శించేడు. కణాంతరాల (Cells) లోని 'క్రోమోజోమ్సు' (Chromosomes) పరిశోధించి వంశలక్షణాల కాకరములైన 'జీన్సు' (Genes)ను నిర్ణయించేడు. సూక్ష్మాతి సూక్ష్మములగు సూక్ష్మజీవుల పరిశోధించి_అవితెచ్చిపెట్టే రుగ్మతల కౌషధాలు తయారుచేసేడు. మానవహృదయం మెదడు వీట్లలోని రహస్యాలు పరిశోధించి అవ్యక్తాలను వ్యక్తంచేయ ప్రయత్నించేడు. హృదయం శ్వాసకోశలు నిల్చిపోగా వాటికి తనశాస్త్ర పరికరాలు తొడిచ్చి పోయేజీవాన్ని నిల్పేడు. బుర్రలోని యూహాలనుగూడ వెలికి చూపించగల యంత్రాన్నిగాని, ఫోటోతీసే తంత్రాన్నిగాని త్వరలో కనిపెట్టే నంటాడు. శరీరాంతరాలలోని నిర్వాహిక గ్రంథులు (Ductless Endochrine glands) పసిగట్టి అవి సమకూర్చే సేంద్రియ పదార్థాలను రసాయనిక పరిశోధన శాలలో తయారుచేసేడు. గర్భస్థమైన పిండానికి లింగభేదం కల్గించే సూత్రాన్ని వెదుకుచున్నాడు. ఇప్పుడు కోడిగ్రుడ్లను కోడి అక్కరలేకుండానే యంత్రంచే పొదిగించి పిల్లలను చేయించగలిగినట్లు, గర్భధారణమైన వెంటనే అండాన్ని వెలికిదీసి పసిబిడ్డ తయారయేవరకు తనప్రయోగశాలలో రసాయనములవల్ల పోషణకల్పించి పెంచడంకూడ కనిపెట్టేడంటే శాస్త్రజ్ఞుని పుణ్యమాయని స్త్రీలోకానికి అనాదినుండి అక్రమంగా సంప్రాప్తించిన పిండభరణ, ప్రసవప్రయాస నివారణమైపోతాయి!!

ఇక వృద్ధులను యవ్వనులగను, విగతజీవులను సజీవులగను చేయగలిగేడంటే 'మానవుఁడు బ్రహ్మపుత్రుడన్న' మాట సార్థకమాతుంది.

ఇందలి విషయాలు శాస్త్రజ్ఞులు అనే శాధారములపై గనకట్టిన లెక్కలు తెల్పుతున్నాయి; భూగోళం సూర్యగోళంనుంచి ఉద్భవించి దాదాపు 2,000,000,000 సం॥లే అయిందట! శాస్త్రరీత్యా ఇవన్నీ యదార్థాలే. కాని, ఈ విషయంలోనే గాక, అనేక విషయాలలో శాస్త్రజ్ఞులుదెల్పే అంకెలు, హంశాలు ఏలావుంటాయంటే—శ్రీ రామకృష్ణపరమహంస చెప్పినట్లు—'ఒకపెద్ద ఫలవృక్షాన్ని చూచి దాని పుట్టు పూర్వోత్తరాలు లెక్కలుకట్టి, దాని పరిమాణం, వయసుని, (universe) దానికున్న కొమ్మలు, ఆకులు, పండ్లు లెక్కలుకడుతూ ఆలెక్కలతోటే సంతుష్టిపడి ఆనందించే గణిక శిఖామణి ఒకడట!—నేరుగపోయి ఆ పండ్లను చవిజూచి, తన్నిర్మాణకర్తయొక్క చాతుర్యాన్ని దలంచుకొని, ఆశ్చర్యానందాలతో తన్మయుడయ్యే జిజ్ఞాసాపిపాసి రెండవవాడట? మొదటివాడు పాశ్చాత్యశాస్త్రజ్ఞుడని, రెండవవాడు భారతీయుడని నేను పోల్చుకుంటుంటాను.!

భారతీయుల ప్రతిభ, శాస్త్రజ్ఞుల సామర్థ్యం పరికిస్తే మానవుని ప్రజ్ఞకేమి అంతువుందా యనిపిస్తుంది. కడకు యేమి తేలిన మహాప్యమేగాని-సృష్టికర్త సృష్టిలో మానవునివంటి అపూర్వజంతువు లేదనే యుమ్మాటికి దప్పాలి. అత్యంత ఆశ్చర్యకరమైన యీ మన శరీరయంత్రంలో-ద్రవ్యం-ప్రాణం-మనసుని (Matter, life and mind) మూడుకలిసి వ్యవహరిస్తుంటే వాట్లలో క్రమంగా అపూర్వమైన నియమాన్ని—జీవిని—వాటి శాసనకర్తను (Organisation organism and organiser)ను చూడఁగలుగుతున్నాం. ఈలాంటి వన్నీ భౌతికనియమాలు 'తారుమారవడంవల్ల' 'నిర్హేతుకంగా' ద్రవ్యాన్నుంచి తయారయేయనగలమా? నిర్జీవమైన భౌతికవస్తువేదైనా సజీవాన్ని కాసిస్తుందా? భౌతిక, లేక, రసాయనికమార్పులవల్లనే అచరం చరంగా మారుతుందనగలమా? అంటే మాత్రం విశ్వాసపాత్రంగా యుంటుందా? ఈ యపూర్వ విశ్వనిర్మాణాన్ని గుర్తిస్తే-భౌతికమైనవియేగాని దానికి భిన్నమైనవి ఆధ్యాత్మికమైనవి యేమీ గోచరింపవా?

'పదార్థాలు వాటికవే కాలక్రమమున మార్పుజెంది చివరకు మనం చూస్తున్న పుస్తకంగా ప్రత్యక్షమైనవం'టే నమ్మ్తామా? ఇది పుస్తకరూపం తేల్చటానికి యెంతపని జరిగింది. ఒకరు వ్రాసేరు; వేరొకరు అక్షరాలను మాటలగా కూర్చేరు; మాటలు వాక్యాలుగా అతికేరు; వాక్యాలు పేరాలుగా అమర్చేరు. కాగితం యెక్కడో బోల్డంత పరిశ్రమ జరిగినవెనుక తయారయి వచ్చింది. దానిపై అచ్చువేసేరు. ఆ వెనుక కుట్టి బైండుచేసేరు, ఇన్ని అయినవెనుక చేతిలోనికివస్తే - 'పుస్తకం తయారవటానికి ఒక సహజవికాస పద్ధతి (Evolution method) వుంద' నిన్ని 'అక్షరాలేవేవో కొన్నిభౌతిక నియమాలవల్ల అలాఅమర్చుకొని పుస్తకంవలె తయారైనవ' నిన్ని అనగలమా? ఒకవేళ అలాజరిగినా పుస్తకంలో ఒకక్రమం, అర్థంవుంటుందా? ఆలాగేఅవర్ణనీయమైన నియమం, అర్థంతోనున్న యీ అనంతవిశ్వశిల్పాన్ని గుర్తిస్తూ - 'కాలప్రవాహంలో క్రమేణకొన్ని భౌతిక నియమాల ప్రకారం శక్తి, ద్రవ్యం - చైతన్యాన్నిపొంది-చివరకు యిలా మనిషిరూపం తాల్చి తాండవమాడుతుంద'ని శాస్త్రజ్ఞులంటే యేమంటారు? 'సృష్టికర్తను తలపెట్టకుండా సృష్టికి అర్థంచెప్పగలుగుతానసే భౌతికశాస్త్రజ్ఞుని సిద్ధాంతం యిది' అంటారుగాని యదార్థమని స్వీకరిస్తారా?

అంతేగాకుండా 'ఎంతోశ్రమకోర్చి తయారుజేసిన పుస్తకాన్ని నామరూపం లేకుండాపూడ్చిపెట్టబోతాడు' అన్నట్లుగా యుగయుగాలుగా కృషిచేసి, శక్తిని పరమాణురూపంగా అమర్చి ద్రవ్యంకల్పించి,

ఘనీభవించినశక్తి స్వరూపంగానున్న ఆ ద్రవ్యానికిజీవంపోసి (తన సృష్టికి ప్రతిసృష్టిచేయాలని తన్ను అనుకరించే) మానవుని తయారుచేసిన ఆ అఘటనఘటనా చతురుఁడగు విశ్వకార్మికుఁడు - 'దీన్ని అంతా తీసికువెళ్లి గంగలో కలిపేస్తాడు. అంతతో సర్వశూన్యం, సర్వనాశనం అయిపోతుంది'అని రాద్ధాంత సిద్ధాంతాలు చేసే - యిలాంటి వూహాలు విశ్వసింప బడతాయా ? సర్వనాశనంతప్ప గత్యంతరం వుండదనగలమా ?

జిజ్ఞాస - విజ్ఞానదృష్టి మానవ సహజములైనవని, జ్ఞానార్జనయే మానవజీవితపు ముఖ్య కర్తవ్యమని గమనించి వెనుక, యీ జ్ఞానసముపార్జనకు పల్వురు పలుశతాబ్దములలో పలువిధముల గడంగిరన్న విషయం కూడ మన గుర్తించగలం. మతాలవల్ల, తపాలవల్ల, ప్రకృతిశోధనవల్ల, చివరకు లోకజీవనంవల్లకూడ కొంత కొంతజ్ఞానం లభిస్తూ వచ్చిందనాలి. 'జ్ఞాన'మంటే - సృష్టిలోని వస్తువులగూర్చి, విషయములగూర్చి మానవుఁడు తన యింద్రియములద్వారాః తదధిష్ఠాతయగు మనస్సుద్వారా యెరుగనయ్యే విషయసంచకమని ఒక తెగవారి అభిప్రాయం. ఈమాదిరి జ్ఞానం చాలవరకు పాశ్చాత్యశాస్త్రాలవల్ల లభిస్తుంది. 'ఇంద్రియా దిష్టములగు భౌతికవస్తువులగూర్చిగాకగాక తదితరములగు సర్వ విషయములగూర్చిగూడ తెలిసికొని - ఇది మిథ్యయని నిరూపించగలిగి, యుక్తాయుక్త వివేకంతో సృష్టికి, తనకు, సృష్టికర్తకుగల భిన్నత్వ యేకత్వముల గ్రహించ గలుగుట; అంతేగాక, స్వానుభవముచే నిత్యానంద, సుఖ శాంతుల చందమరయగలుగుట - ఆదిగాగలదేదైతే యున్నదో అదే -' 'నిజమగు జ్ఞాన'మని, 'విజ్ఞానం'అనీ ఆదిమవాసులైన భారతీయుల దృష్టిలో - అర్థం. దీనిని సాధించుటకైయుండే మనోవాంఛనే 'జిజ్ఞాస'యన్నారు.

ఎవరుదేన్ని 'విజ్ఞాన'మనుకున్నా - మానవబుద్ధికి యీ సృష్టిలోని వస్తుజాలాన్నిగూర్చి తెలిసికోవాలన్న అభిలాష, సృష్టికి ఆది - క్రమం - అవధి యెరిగికోవాలన్న కుతూహలం సహజంగా ఉందనడం మాత్రం నిజం. ఆ అభిలాషయే యింతవరకు మనిషి సేకరించిపెట్టిన సర్వజ్ఞానానికి మూలమైంది. క్రమేణా వస్తుజాలంనుంచి సృష్టికర్తమీదికి - దృష్టి ప్రసరించడంగూడ సహజమేకావాలి ! అలా అయిందా ?— చూద్దాం.—

జ్ఞానార్జనానికియుండే మార్గాలలో శాస్త్రపరిశోధనా విధానం ఒకటి. శాస్త్రరీత్యానేగాక, జ్ఞానార్జనానికి వేరే మార్గాలున్నాయి. అవే మన పూర్వులవలంభించిన మార్గాలు. వారు - యిప్పటి దూరదర్శని యంత్రాలు, 'న్యూటను' (Newton) గారి పునాది సిద్ధాంతాలు, మరి యితర శాస్త్రపరికరాలు ఏమీ లేకుండానే గ్రహాలసంచారక్రమం, గ్రహణాల సంఘటనకాలం, వాసింతైనా తప్పిపోకుండా సరిగా లెక్కలు గట్టి చెప్పేరు. పిపీలకాది బ్రహ్మపర్యంతమువారూ పరీక్షించేరు; కాని మానసిక - జ్ఞాన - నేత్రంతోటే. పరిశీలించి ఇద మిత్థమని వ్రాసిపెట్టేరు. అవి చదివిచూస్తే మన నిగమార్థాలకు పాశ్చాత్యుల శాస్త్రార్థాలకు వుండే పూర్వాపరా సంబంధాలు గ్రహింపవచ్చు.

ఒక్కవిషయం తప్పక గుర్తింపదగ్గది:—భౌతికదృష్టితో విశ్వాన్ని పరీక్షించిన ప్రస్తుత పాశ్చాత్యులు - పారమార్థికబుద్ధితో తమ్మతామే శోధించుకొన్న పూర్వీకులు చివరకు ఒకే అభిప్రాయం తేల్చడం ఆశ్చర్యమేను ! పాశ్చాత్యంవారివి ప్రాచ్యంవారివి పద్ధతులువేరైనా - పరిశోధింపబడినవి సృష్టి మానవ ప్రకృతీని. ఒకరు చుట్టుత్రోవత్రొక్కేరు; ఇంకొకరు అడ్డుత్రోవనుచేరేరు. ఒకరు భౌతికంగా పరీక్షించడం మొదలెట్టి నీడనుండి గోడకుచూచేరు; ఇంకొకరు మానసికంగా మర్మాన్నెరిగి గోడనుండి నీడకుచూచేరు. అందుచేత వీరు చెప్పేవాట్లలో మొదట తేడాలుంటాయి - కాని చివరకు అందరుచెప్పిందీ ఒకటేకావాలి.

'సత్యం' ఒకటేగనుక. ఆ భేదాలకు కారణం తెలియాలంటే యీ క్రిందిఅంశాన్ని గుర్తించాలి:—దేనిని గూర్చి అయినా మనిషి తెలిసికొంటున్నాడంటే రెండు ముఖ్యావసరాలుగా కనబడుతున్నాయి. ఒకటి (చూడబడే) బాహ్యవస్తువున్నూ, రెండు (చూచే) మనస్సున్నూ. కొందరు బాహ్య ప్రపంచంయొక్క యునికి యదార్థం అనుకొనిదాన్ని పరిశోధించేరు. ఇదే ప్రకృతి శాస్త్రాలుచేసినపని. మరికొందరు గ్రహించే మనస్సుండుటవల్లనే బాహ్య ప్రపంచమనేది ఒకటి తోస్తుందని, మానసేతర ప్రపంచంయునికి ఊహాజన్య మని, మనస్సుయొక్క యునికియే వాస్తవమని నమ్మేరు. ఇది భారతీయుల వేదాంతవిధం. 'ఎందరెన్ని చెప్పినా ఒక్కొక్క దృక్పథంలోచూచి గ్రహించిన విషయాలేగాని, సమగ్రదృష్టితో గ్రహించినవి కాజా లవు. సమగ్రంగా తెలుసుకోవడం స్వతహాగా మానవబుద్ధికి సాధ్యంకాదనితోస్తుంది' అన్నారు కొందరు. 'ఎక్కడో యేమూల కొమ్మనోయున్న చిన్న పర్ణానికిగాని, పుష్పానికిగాని అనంత విస్తృతమైన వృక్షాన్ని సమూలంగా తెలిసికోవడం తరంగాద'న్నారు మరికొందరు. 'తానెవరో తానెరుగని వింతమనిషి - తనకంటె యితరమైనదేదియో యున్నదని దాన్నిగూర్చి తన శాస్త్రపరిభాషలో చెప్పబూనుట తమాషా'యని కొంద రంటారు. 'అసలు సత్యం అవాఙ్మానసగోచరమై, అగ్రాహ్యమై, అవాచ్యమై, కేవలం స్వానుభవైక గమ్యమై వుంటుంద'ని జ్ఞానులంటారు! అంటే యేమిటో!

—కె. సుగుణమణి.

---

# జ్వర విషయములు

స్వస్థత జెందుటకు ఆహారము ముఖ్యముగా తోడ్పడును. శాస్త్రపరిశోధకులు జ్వరమును గురించి నూతన విషయములను తెలియపరచినారు. అదే మనదేహ ఉష్ణము హెచ్చుట, సహించలేని తలనొప్పి వణకునంతట చలి మొదలగునవి జ్వరచిహ్నములు. జ్వరవిషయము రక్తమునందు కల నరకండరములలో ప్రవేశించి మనుష్యుని బలహీనునిగా చేయును.

పూర్తిగా స్వస్థతచెందుటకు పూర్వము అలసిన అవయవములను తిరిగి అభివృద్ధిచేయుట అత్యా వశ్యకము. అందుకుగాను గట్టిగానుండు సర్వసాధారణ ఆహారము పనికిరాదు. కారణము కడుపు నీరసముగానుండి జీర్ణశక్తి లేకపోవుటచేత.

జ్వరపీడితులకు, హార్లిక్స్ శ్రేష్టమైన ఆహారపదార్థమని ఋజువుచేయబడినది. క్లిష్టసమయము లందు హార్లిక్స్ తీసికొనుటవలన కడుపుకేవిధమైన బాధ కలుగదు. స్వస్థతపొందుటకు కావలసిన వస్తువులు దీనియందున్నవి. అనతికాలములో దేహారోగ్యమునిచ్చి నూతన యవ్వన వంతునిగా చేయును. సాధారణముగా అన్ని ఆస్పత్రులలోను హార్లిక్సును జ్వరబాధితులకు ఇచ్చు ఏర్పాటుచేసినారు.




గోధుమలతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—5

## పాకం బూరెలు

2 వంతుల పెసరపప్పును, చిటికెడుప్పువేసి ముద్దగా వుడికించి, చిన్నచిన్న వుండలుచేసి, 1 వంతు గోధుమపిండిని కొంచెము చిక్కగా నీటితో కలిపి, దానిలో వుండలుముంచి మరగించిన చమురులోవేసి, 3 వంతుల పంచదార లేతపాకంపట్టి, వుండలను వేయవలెను.

## మజ్జిగ వుప్మా

1 ఫలం మరగించిన చమురులో, ఆవాలు, కరివేపాకు, మినప్పప్పు, శనగపప్పు కొద్దికొద్దిగావేసి, 2 ఎండు మిరపకాయలను కొద్దియింగువ, చిటికెడుపనుప్పువేసి పోపుపెట్టి 1 గ్లాసు గోధుమనూకనువేసి కొంచెము వుప్పుతో 1½ గ్లాసు చిక్కని మజ్జిగనువేసి వుడికిన తర్వాత దించవలెను.

## రసగుల్లా

3 వంతుల చిక్కనిపాలను మరగుచున్నప్పుడు అరబద్ద నిమ్మరసముపిండి, విరగగొట్టవలెను. దానిని వడగట్టగా వచ్చినముద్దలో 1 వంతు గోధుమనూకను ఎర్రగావేయించి కలుపి చేతితో బాగామద్దించి నిమ్మకాయంత వుండలుచేసి ఆవిరిమీద 10 నిమిషములు వుడికించి 3 వంతుల పంచదార లేతపాకంపట్టి దానిలో వేయవలెను.

## కొబ్బరిపోళీ

3 వంతుల పచ్చి కొబ్బరికోరు, 2 వంతుల బెల్లముగుండకలిపి బాణలిలో వేయించవలెను. 1 వంతు గోధుమపిండిని ముద్దగాతడిపి, అరటిఆకులో, చేతితోవత్తి దానిలో కొబ్బరివుండలనుపెట్టి బొబ్బట్లువత్తి పెనముమీద చమురురాచి ఎర్రగా కాల్చవలెను.

## అరటిపండ్ల బజ్జీ

ముగ్గిన అరటిపండ్లను, చక్రములుగా తరగవలెను. పావుశేరు గోధుమపిండిలో 1/8 శేరు పంచదార వేసి నీటితో చిక్కగాకలిపి, అరటిపండ్ల ముక్కలను గోధుమపిండిలో ముంచి మరగించిన నేతిలోగాని డెంకాయనూనెలోగాని వేయించి తీయవలెను.

# విజిటబుల్ పఫ్స్

10 ఫలముల బంగాళాదుంపలను మెత్తగా వుడికించి తోలుఒలచి 2 ఫలముల వుల్లిపాయలను 4 పచ్చిమిరపకాయలను, అల్లమును, కొత్తిమిరిని సన్నగాతరిగి కొద్దిగా పచ్చికొబ్బరిముక్కను 1 ఫలం జీడిపప్పును చిటికడు పసుపుగుండ 1 చంచాపుప్పును వుడికించిన దుంపలలోవేసి అన్నిటిని మెత్తగా రుబ్బవలెను. రుబ్బినముద్దను కోలగా బిళ్లలుచేసి గోధుమపిండిని చిక్కగా నీటితోకలిపి బిళ్లలను పిండిలోముంచి మరగిన చమురులో వేయించవలెను.

# బరోడా వుప్మా

1 పావుశేరు శనగపిండిలో 2 ఫలముల వుల్లిపాయలను 2 పచ్చిమిరపకాయలను సన్నగాతరిగి ½ చంచాపుప్పువేసి గట్టిగా కలుపవలెను. 1 ఫలం మరగిన చమురులో కొద్దిగా మినపప్పు, ఆవాలు, 2 ఎండు మిరపకాయలు, కరివేపాకు కొద్దిగా శనగపప్పు, పోపుపెట్టి, ⅛ శేరు గోధుమనూకను వేసి 1 చంచాపుప్పును వేసి ¼ శేరు నీరుపోసి వుడికినతర్వాత వేయించిన పకోడీలను వేసి బాగా కలుపవలెను.

# కొబ్బరికాయ హల్వా

1 ఫలంజీడిపప్పు, 1 ఫలంద్రాక్ష నేతిలో వేయించి తీసుకోవలెను. ఆ చమురులో, ½ శేరు గోధుమ, ఏలకగుండ, నూకను, ఎర్రగావేయించి, 2 కొబ్బరికాయలను చిక్కగా పాలుతీసి, పోయవలెను. ½ శేరు పంచదార, కుంకుమపువ్వు, వేయించిన జీడిపప్పు, ద్రాక్షవేసి, పాలు యినికినతర్వాత దించవలెను.

# మలబారు హల్వా

3 కొబ్బరకాయలను, చిక్కగా పాలుతీసి ఎసరుపెట్టవలెను. మరిగినపిదప, 1 గ్లాసు గోధుమపిండి 1 గ్లాసు బియ్యముపిండి, 2 ఫలముల జీడిపప్పు, 7 ఫలముల బెల్లముగుండ, 1 ఫలంద్రాక్ష, ఏలకగుండవేసి ముద్దఅయేవరకు కలుపుతూ, 1 ఫలం నెయ్యివేసి దించి, పళ్లెములో ఆరపోసి, పలచగా ముక్కలు కోయవలెను

# పైనాపిల్ కేకు

1 పావుశేరు గోధుమనూకను, 1 పావుశేరు శనగపిండిని, చమురువేయకుండా, వేరువేరుగా వేయించి తీయవలెను. ¼ కురిడీ ఎండుకొబ్బరికోరును గోధుమనూకతోచేర్చి, మెత్తగాదంచవలయును. తర్వాత శనగ పిండిని కలిపి, 2 ఫలముల జీడిపప్పును సన్నగా ముక్కలుచేసి, ఏలకగుండవేసి దంచిననూకతో, శనగపిండిని, జీడిపప్పుముక్కలను వేసి, బాగా కలుపవలెను. 1½ పావుశేరు పంచదార ముదరపాకంపట్టి, దానిలో దంచిన గుండనువేసి ¾ పావుశేరు నెయ్యిపోసి, గట్టిపడినతర్వాత, ఒక పళ్లెములో ఆరపోసి, రోజా ఎసన్సుచల్లి, ముక్కలుకోయవలెను.

# గోధుమ ఆపాలు

¼ శేరు గోధుమలను ¾ శేరు ఎసరులోపోసి, వుడికించివార్చి, మెత్తగా రుబ్బవలెను. ½ శేరు పుల్ల పెరుగులో ¼ శేరు బియ్యంపిండినివేసి, నూరినముద్దనువేసి, 1 చంచా వుప్పువేసి, 1 చిప్ప పచ్చికొబ్బరికోరువేసి, సన్నమంటమీద, బాణలిలో చమురురాచి ఆపముపోసి, పైన సన్ననిప్పు శగనువుంచవలెను.

## నూకరొట్టి

1వంతు మినపప్పును నానబెట్టి మెత్తగారుబ్బి, 1వంతు గోధుమనూకనుకలిపి, 1చిప్ప పచ్చికొబ్బరి కోరును, 1 చంచా వుప్పుగుండను వేసి, ఒకపాత్రలో నెయ్యిరాచి, ఈపిండినిపోసి, ఆవిరిలో వుడికించవలెను.

## పొట్లకాయ చిప్స్

5 ఫలముల బంగాళాదుంపలను వుడికించి, తోలువలచి, కొద్దిగా కారముపొడి, చిటికడు పసుపు గుండ, ½ చంచా వుప్పునువేసి మెత్తగానూరవలెను. 1 పొట్లకాయను, 1 యించిపొడవున గుండ్రముగా ముక్కలుకోసి దానిలోగింజలుతీసి వుడికించిన బంగాళాదుంపముద్దను పొదిపి గోధుమపిండిని చిక్కగానీటితో కలిపి, ముక్కలను పిండిలోముంచి, మరిగిననూనెలో వేసితీయవలెను.

—ఇస్నానేని సావిత్రీదేవి

## కొబ్బరి కజ్జికాయలు

ముదురు కొబ్బరి కాయలు నాలుగుకోరి ఎఱ్ఱగావేపి ఒక పెద్ద పళ్లెములో వేయవలెను. ¼-సేరు గోదుమరవ ఆలాగేవేయించి కోరుతోకలుపవలెను. సోలెడు గసగసాలు తగుమాత్రం యాలకపొడి, కిసిమిసి పళ్లు, ఒకసేరు పంచదార ఇవి అన్నియు కోరుతోవేసి కలిపిపూర్ణము తయారుచేసి, తవ్వెడు మైదాపిండి, తవ్వెడు గోదుమపిండి, చిటికెడు వుప్పు, గిద్దెడు పంచదార వేసి పూరీలుపిండివలె తడిపి నెయ్యితోమర్దించి పూరీవలె పలచగాచేసి పైపూర్ణము పెట్టి మడిచి అంచులు కజ్జికాయల చక్రముతో కోసివేయవలెను. ఇట్లు తయారుచేసిన తరువాత కళాయిలో నూనే, నెయ్యి వేసికలిపి కజ్జికాయలు దోరగా వేయించవలెను.

## గోధుమ పాలముంజలు

½-సేరు చిక్కనిపాలు పొయ్యిమీదపెట్టి పొంగు వచ్చినప్పుడు ¼-సేరు గోదుమపిండి గరిటజారుగా చిటికెడు వుప్పు సోలడు పంచదార, కొంచము యాలుకలు పొడి పాలలోవేసి వుండకట్టకుండా కలిపి దించవలెను. ఒక కొబ్బరికాయ కోరు అర్ధపావు పంచదార కలిపి లేతపాకము పట్టి పళ్లెములో వేయవలెను. పైచెప్పిన పిండిముద్దచేసి, చేతికి నెయ్యిచరుముకొని నిమ్మకాయలంత వుండలుచేసి చేతితోతట్టి కొబ్బరిముద్ద పెట్టిపొదిగి అరచేతివెడల్పున తట్టి నేతిలో వేయించవలెను.

—ద్వారపు రత్నాబాయి

## గులాబిజాములు

½ శేరు పాలు మరగనిచ్చి ¼ శేరు పంచదారను పాలలోవేసి గరిటెతో కలుపుతూ వుండవలెను. గట్టిపడిన తరువాత దింపి దొండకాయలవలె చేసి, పావుశేరు గోధుమపిండి నీటితో కొంచం చిక్కగా కలిపి, ½ శేరు నెయ్యిని వెడల్పుపాత్రలో పోసి మరగనిచ్చి గులాబిజాములను పిండిలో ముంచి నేతిలోవేసి వేయించి తీసి, 1 శేరు పంచదార లేతపాకం పట్టి కొంచెం నిప్పులమీద వుంచి వేయించిన గులాబిజాములను పాకంలో వెయ్యవలెను.

## రవచంద్రకాంతలు

పావుశేరు పెసరపప్పు నీటిలో నానబెట్టి మెత్తగా రుబ్బవలెను. దానిలో పావుశేరు గోధుమ రవను రుబ్బి కలుపవలెను. ½ శేరు పంచదార పాకంపట్టి రుబ్బిన పిండిని పాకంలోవేసి ¼ తులం ఏలకపొడివేసి కలిపి ఒక పళ్లెమునకు నెయ్యిరాచి దానిలోపోసి చాకుతో ముక్కలు కోయవలెను. ½ శేరు నెయ్యిని పొయ్యిమీద పెట్టి కోసిన ముక్కలను వేయించవలెను.

## కజ్జికాయలు

¼ వీశ గోధుమపిండిని నీటితో గట్టిగ కలుపవలెను. ¼ వీశ గోధుమరవ నేతిలో ఎఱ్ఱగావేయించి, 1 కాయ కొబ్బరికోరు వేయించి కలుపవలెను. ¼ వీశ పంచదార, కొన్ని ఏలకిపొడి కొంచెం నెయ్యి వీటినన్నింటి నూకలో కలుపవలెను. గోధుమపిండిని పూరీవలె వత్తి దానిలో ముందుచేసిన పదార్థాలను పెట్టి కజ్జికాయల మల్లె పెట్టి మూసి ½ వీశ నెయ్యిని వెడల్పు పాత్రలోపోసి కాగనిచ్చి కజ్జికాయలను వేయించి తీయవలెను.

## ఇడ్లీ భాత్

పావుశేరు మినపప్పు నీటిలో నానబెట్టి మెత్తగ రుబ్బి పావుశేరు గోధుమనూక కలిపి ఇడ్లీ వండవలెను. ఇడ్లీలను చిదిపి పొడిగ పిసకవలెను. ఒక పాత్రను పొయ్యిమీద పెట్టి 2 తులముల నెయ్యివేసి ½ తులం మినపపప్పు, ¼ తులం ఆవాలు, కొంచం మెంతులు, కర్వేపాకు, 4 పచ్చిమిరపకాయ ముక్కలు, అల్లం ముక్కలు వీటినన్నిటిని వేయించి పైపిండిని వేసి 10 నిమిషములుంచవలెను. తరువాత దింపి 1 నిమ్మపండు రసం పిండవలెను. తగుమాత్రం వుప్పు వేయవలెను.

## రవ జంతికలు

¼ వీశ వరిపిండి ¼ వీశ శనగపిండి ¼ వీశ గోధుమరవ 1 చిటిక సోడా ½ తులం కొట్టిన వుప్పు ¼ తులం వాము ¼ శేరు నువుపప్పు వీటిని తగుమాత్రం వేసి నీరుపోసి గట్టిగ కలుపవలెను. ఒక వెడల్పుపాత్రలో నెయ్యిని కాగనిచ్చి జంతికలు తిప్పి వేయించి తీసిపెట్టవలెను.

—సి. హెచ్. అన్నపూర్ణాబాయి

## ⸻ బంగారుపతకం బహుమానం ⸻

గోధుమ ధాన్యముతో చేయదగిన పలువిధములైన పదార్థములను, గత సంచికల లోని నాలుగు పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపినవారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తి వ్రాయగూడదు.

సంపాదకుఁడు.

# పుష్పచయము * * *

## హిందూ స్త్రీల ఆస్తిహక్కుల బిల్లు

హిందూ స్త్రీల ఆస్తిహక్కుల శాసనాన్ని ఇంకా సవరించడానికిగాను అఖిలచంద్ర దత్తాగారు ఢిల్లీ కేంద్రశాసనసభలో ఒక బిల్లును ప్రతిపాదించారు. ఈ బిల్లును సెలెక్టుకమిటీకి పంపాలనికూడా వారు కోరారు. హిందూ కుమార్తెకు క్రొత్తహక్కుల నివ్వటం యీ బిల్లు ఉద్దేశ్యంగాదు. 1938 సం॥పు హిందూ స్త్రీల ఆస్తి హక్కు ఆక్టువల్ల పోయిన హక్కులను తిరిగి సంక్రమింపజేయడమే యీ బిల్లు ఉద్దేశ్యం. ఈ సవరణ ఆక్టువల్ల కుమార్తెల హక్కులు కోడండ్రకు ఇవ్వబడింది. 1938 సం॥కు పూర్వము కుమార్తెలకున్న హక్కులు తిరిగి వారికివ్వబడతాయి. ఈ బిల్లు ప్రజాభిప్రాయానికి ప్రకటింపబడింది. వచ్చిన అభిప్రాయాల్లో అధికభాగము బిల్లుకు అనుకూలంగా వున్నాయి.
ముఖ్యంగా వారసత్వపు హక్కు, ఆయా తెగల వంశ, ఆచారపద్ధతులు, విడాకులు మొదలైన యితర విషయాలను చర్చించడానికి, సాధ్యమైనంత త్వరలో విచారణసంఘాన్ని నియమించడానికి ప్రభుత్వంవారు ఏర్పాట్లుచేస్తున్నారు.

## ఫిలిం డైరెక్టర్లకు సలహా

రాజమండ్రి మహిళాసభవారు ఫిలిం డైరెక్టర్లకు యీలా సలహాలిచ్చారు :
తెనుగు సినీమాల్లో పాడేపాటలు హిందీపాటలవరుస ననుకరించుట పరిపాటైపోయిందనియు, ఇది ఆంధ్రులకు కళంకదాయకమనియు, తెనుగు సంగీతంలో అనేక క్రొత్తరాగాలు కలవనియు, కావున ఈలోటును సవరించుటకు మ్యూజిక్కు డైరెక్టరులను కోరుచు ఒక తీర్మానం గావించారు.
ప్రాచీన నాటకలక్షణాల్లో రంగస్థలమున భోజనాలు, శయ్యాగృహము, మరణము, మున్నగునవి నిషేధించిరనియు, ఆనియమాలు ఫిలిములలో పాటించనందున అనేగ అనర్థాలు వస్తున్నవనియు వీటిని సవరించమని కోరుచూ మరొకతీర్మానమును గావించారు.

## ఐదువేళ్ల తల్లి

ప్రపంచంలోకంతా గూడ చిన్న బిడ్డతల్లి పెరూదేశస్థురాలు "లినామెడీనా." ఈమె 5 సంవత్సరముల వయస్సు, ఒక గజంపొడుగుగలిగి యున్నది. ఈమెకుబుట్టిన మగబిడ్డ 6 పౌనులబరువు గల్గియున్నాడు. ఈ సృష్టివైపరీత్యానికి డాక్టర్లు తారుమారవుతున్నారు.
లినామెడీనాకు భర్త ఎవరు? అనేదింకా తేలనేలేదు. మెడీనాతల్లి ఇలా అంటుంది: "పరిసరాల్లో "సైరణ్"అనే ఒక పాముజాతివుంది. హిందూశాస్త్రప్రకారం ఆజాతిపాములు స్త్రీలకు గర్భాన్ని గల్గిస్తవి. ఒకనాడు మెడీనా ఆపాముకాటుకు గురిఅయింది. కనుకనే సంతానోత్పత్తి గల్గివుండవచ్చు."
తండ్రి ఇంకోరకం కథచెప్తాడు: తాము నివసించే ప్రదేశముప్రక్కన కొండలలో ఒక చిన్నగుంట గలదనియూ, (దానిపేరు "పూల్ ఆఫ్ బర్త్") ఆ గుంటలో స్నానమాడినవారికి గర్భోత్పత్తి గల్గుననియు, మెడీనాకది అలవాటనియు, అదేఆమెకు గర్భోత్పత్తి కారణమై యుండవచ్చుననియు అంటాడు.

నిజం నిలకడమీదగానీ తెలియదు. చికాగోలోని డాక్టర్లు అంతా చాలాకాలంనుండీ వైద్య ప్రపంచాన్ని కలవరపరిచే సృష్టి రహస్యాన్ని కనుగొనుటకై తీవ్రకృషి సల్పుతున్నారు. వారి కృషిఫలితానికి లినామెడీనా కారకురాలౌతుందా?

## దేవుడు నిద్రపోతున్నాడా?

పూర్వం హిందూయోధులు రణభూమికి వెళ్లేటప్పుడు వారి తల్లులుగాని, సతులుగాని నొసట కుంకుమ పెట్టి విజయాక్షింతలు చల్లి పంపేవారట. జవహర్‌లాల్ గాంధిజీని చూడవస్తే కస్తూరిబాయి జవహర్‌ను ఒకక్షణం ఆగమని నొసట కుంకుమ తిలకం దిద్దిందట. 'ఇప్పుడీ గొడవ ఎందుకూ? అవసరంలే' దన్నాట్ట జవహర్. 'మనం మళ్లీ ఎన్నాళ్లకు కలుసుకుంటామో భగవంతుడికే తెలియాలి.' అన్నదట ఆ మహా తల్లి. 'లేదు లేదు. అమ్మా! దేవుడు, నిద్రపోతున్నాళ్లే!' అన్నాట్ట నెహ్రూ పండితుడు.

## కల్లు సారాయీలకు బదులు 'టీ'

కాన్పూరు 'లేబర్ వెల్ ఫేర్ సెంటర్సు' శాఖాధికారియొక్క యిటీవ ప్రభుత్వ ప్రచురణలోయిలా వుంది: "ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిని లేబరు వెల్ ఫేర్ సెంటర్సులో ప్రతిచోట కనీసము ఒక్కొక్క 'టీ'శాలను ఏర్పాటుచేయవలసినదిగా కోరడమైనది. ఆ యాశాలలో టీని ఉచితముగా ఇచ్చుచున్న బోర్డువారు అభివందనీయులు. వారు రేడియోనుకూడ ప్రతిచోట స్థాపించుటచేత పనివారు తరుచుగువచ్చి [illegible] ప్రోత్సాహకరంగా ఉంటోంది. 1939వ సం॥ 10 నెలల టీశాలలలో 3,440కుండి టీ ఖర్చుపెట్టబడినది. ప్రస్తుతం 4,200 కప్పుల టీ పగటి ఖర్చు అవుతోంది. దీనివలన లేబరు సెంటర్లు [illegible] ఆసక్తి ఎక్కువ అవుతూవుంది."—

కల్లు సారాయీలకుబదులు యీ టీ పానీయాన్ని ప్రవేశపెడితే బాగానేవుంటుంది. అయితే కల్లు సారాయిలు ముందుగా మాని వేసిన తర్వాతే యిది ప్రవేశపెట్టబడాలి. లేకపోతే రెండు అలవాటు అయిపోయి కొరివితో తలగోక్కున్నట్టవుతుంది.

## ఖమ్మం కర్మం

ఖమ్మంలో కొన్ని ఇతరప్రాంతాలవలె ఆంధ్రబాలికల విద్యావ్యవస్థలో ఇబ్బంది యేర్పడింది. బాలికలు బాలురవలె పరభాషలో విద్యాభ్యాసము చేయుటకు వీలులేదు. ఇదివరలో ప్రభుత్వమువారు తెలుగుబాలికలకొక పాఠశాలను స్థాపించి నడిపించుచుండిరట. "మొహీతెమీంసాహెబా"గారు ఇటీవల ఖమ్మం వెళ్లినారు. బడిచూచినారు. పోయినారు. బడి బందుచేయుటకు శ్రీముఖంపంపినారు. ఆంధ్రపాఠశాల అంధపాఠశాల అయిపోయింది. ఇష్టముంటే మీ పిల్లలు ఉర్దూబడిలో ఉర్దూ చదువుకోవలె అన్నారట! జనసంఖ్యలో ఆంధ్రులెక్కువ. ఉర్దూచదువువారు తక్కువ. కాని యీ "సాహెబా"గారి తర్కం తలకిందుతర్కంగావుంది. ఈ "సాహెబా"గారి కిట్లుచేయుటకు విద్యాశాఖ వారధికారమిచ్చినారా? ఇచ్చినచో ఏనియమానుసారముగా ఇచ్చినారో? తెలియదు. అదే గ్రామస్థుల పన్నులతో ఉర్దూపాఠశాల నడుపవలెను. అదేగ్రామస్థుల చందాలతో తెనుగుపాఠశాల నడుపుకోవలెను. ఇక విద్యావ్యాప్తి యెట్లగును? ప్రభుత్వమువారు వెంటనే ఈ ఘోరమైన అన్యాయాన్ని తొలిగింపవలెను.

—గోలకొండ.

## తొమ్మిదణాలకోసం ఆస్తిని వేలంవేశారు

నిత్యైసాహు ఒరిస్సారాష్ట్రంలోని పర్లపారా ఎస్టేటుకు చెందిన ఒక బీదరైతు. ఒకనాడు, అతడువుండే 'తాలబహాలి' గ్రామ ప్రాథమిక పాఠశాల ఇంటికప్పు నేతనేయడానికి, కూలినాలి లేకుండానే, రమ్మనమని స్థానిక అధికారులు కోరారు. నిత్యైసాహు రానన్నాడు. అంచేత అతనికి తొమ్మిది అణాలు జుల్మానా విధించారు. అతడా జుర్మానా ఇవ్వలేదు. అంచేత అతనికున్న ఆస్తిని అధికారులు వేలంవేశారు ఆ తొమ్మిదణాలు రాబట్టుకొనేందుకు. ఇది జరుగుత ఎప్పుడోకాదు గత సెప్టెంబరు మాసంలోనే.

—స్టేట్సు పీపుల్.

# చలనచిత్రాలు

## జగదీశ్ ఫిలిమ్సువారి 'విశ్వమోహిని' వన్నెమీరిన వ్యంగ్యచిత్రం

వీరి రెండవ సాంఘిక చిత్రమైన 'విశ్వమోహిని' గతమాసంలో విడుదల అయింది.

ఆంధ్రదేశపు అన్ని కేంద్రాల్లోను అమితోత్సాహంతో సాగిపోతోంది. కథ నవీన చలనచిత్ర కళా-పరిశ్రమకు చెందినదవటంచేత, దీనిలోని కథలో క్రొత్తదనం ఒకటి రూపొందింది. ఈ పరిశ్రమయొక్క లోటుపాట్లు, నటీనటులయొక్క తీరులు, డైరెక్టర్ల ప్రవర్తనలు, పెట్టుబడిదార్ల వ్యవస్థలు వ్యంగ్యముగా విమర్శింపబడుతూ, యీ పరిశ్రమ నాధారం చేసుకునేవారికి చాలావిషయాలను బోధిస్తోంది.

సుప్రసిద్ధ దర్శకుడు శ్రీ వై. వి. రావుగారు ప్రధానభూమికను చక్కగా నిర్వహించారు. కథానాయకురాలు శ్రీమతి లలిత తనపాత్రను చక్కగా పోషించింది. సంగీతంకూడా చాలామధురంగావుంది. ఫోటోగ్రఫీ, సౌండు నిర్దుష్టంగా వున్నాయి.

సినీమాలను 'కులాసా కాలక్షేపం'గా చూచిరావడానికి యీ చిత్రంలో కావలసినంత వస్తువుంది. ఒకసామాజిక వ్యవస్థను వ్యంగ్యంగా చిత్రించడానికి పూనుకొన్న యీ చిత్రం విజయవంతమయింది అని చెప్పొచ్చు.

## ఫేమస్ ఫిలిమ్సువారి 'ధర్మపత్ని'

చిత్రం పూర్తిఅయి చాలాకాలమైంది. దీనిలో సంఘజీవితానికి సంబంధించిన క్రొత్తవిషయాలు బాగా చర్చించబడ్డాయి. దర్శకులు పి. పుల్లయ్యగారి దర్శక చాకచక్యం దీనిలో మూడుమూర్తులా మూర్తీభవించి, ఒక అపూర్వస్థానాన్ని సంపాదిస్తుంది.

## శ్రీ వసుంధరా ఫిలిమ్సువారి 'మైసూరు దసరాచిత్రం'

శ్రీ గాలి వెంకటేశ్వరరావుగారి ఆధ్వర్యాన వెలువడబోతోంది. స్వదేశ సంస్థానాల్లో మకుటాయమానమైన మైసూరురాజ్యములోని బృందావన ఆరామాలు, శివగంగ జలపాతాలు, జంతుప్రదర్శనశాలలు చారిత్రకదృశ్యాలు, దసరాఉత్సవాలు, దర్బారులు మొదలైన వివిధదృశ్యాలు చక్కగా పొందుపరుప బడ్డాయి ఇందులో. వీటినిచక్కగా వివరించడానికి చక్కనిపాటలు, మాటలు కూరుస్తున్నారు. రెండుభాషల్లో అప్పుడే తయారయింది మరిరెండు భాషల్లో తయారవుతూవుంది. మనదేశానికి సంబంధించిన ఇటువంటి రసవత్తర విషయాలను ఇటువంటి వృత్తాంత చిత్రాలుగా తయారుచేసి, ప్రజలలో విజ్ఞానాభివృద్ధికి దోహదమిచ్చే శ్రీ వెంకటేశ్వరరావుగారి ప్రయత్నం అభినందనీయం.

## నవ్య కళావారి 'మీరాబాయి'

యీ పరమ భక్తురాలి దివ్యచిత్రం యీ మాసం 5-వ తారీకున ఆంధ్ర దేశంలో విడుదల కాబోతూవుంది. దీనిలో నవ్యపోకడలు, హృదయంగమమైన గానం అమితంగా వుంటాయని తెలుస్తోంది.

# గ్రంథ సమీక్ష

## ప్రేంచంద్ అనువాదాలు

కర్త: శ్రీ నెల్లూరి కేశవస్వామిగారు. సాధనసమితి వారి రెండవ కుసుమం. చిరునామా, సాధన సమితి, సికిందరాబాదు, దక్కను. వెల తెలియదు—

ఇందులో ఆత్మగానం, సతి, తుదికానుక, బరాత్ అనే నాలుగు కథలున్నాయి. భిన్నభిన్న జీవిత తరంగాలను కథానికల్లో చెప్పడం ప్రఖ్యాత రచయిత ప్రేంచంద్ అందెవేసిన చేయి. యీ నాలుగు కథల్లోను యీలాంటి సమస్యలు చక్కగా పొందుపరుపబడ్డాయి. కర్త శ్రీ కేశవస్వామిగారు కూడా మూలానికి ఏ విధంగాను లోటుపోకుండా అనువదించారు. రచయితకు మంచిభావనా దృష్టి, రచనాశక్తి వున్నదని చెప్పటానికి యీ అనువాదాలే మంచి నిదర్శనం.

## సఫలత

కర్త: శ్రీ వడ్లమూడి వెంకటరత్నం. దుగ్గిరాల, గుంటూరుజిల్లా, వెల ఒక రూపాయి—

"సఫలత ఒక్క ఇహమునకుగాని, పరమునకుగాని సంబంధించినది గాదు...తత్స్వరూపమును సూచించుటకీ చిన్నగ్రంథము తోడుపడగలదు." కవిగారి యీ ఆశయం యీ చిన్న గ్రంథంలో పరిపూర్ణత నొందింది. వివిధమైన శీర్షికలతో సఫలతాస్వరూపము చక్కగా విమర్శింపబడింది ఇందులో. ఆముష్మిక చింతా సక్తులందరు చదవదగినది.

## గాంధీబోధ

యుగప్రవక్త గాంధీమహాత్ముని ధర్మ సిద్ధాంతాలను క్రోడీకరించి సర్వత్ర వ్యాపింపచేసే ఉద్దేశ్యంతో పుస్తకరూపంగా ప్రకటింపబడింది. ప్రతివారు చదివి అనుష్ఠింపదగినది. ప్రతులు కావలసినవారికి శ్రీ ముత్తింటి గు. వె. జ. సత్యనారాయణమూర్తి, కార్యదర్శి, శ్రీ రామకృష్ణ సేవాసంఘం, బారువ, విశాఖపట్నం జిల్లా వారికి అర్ధణాస్టాంపు పంపిస్తూజాబువ్రాస్తే ఉచితంగా పంపిస్తారు.

## కేనోపనిషద్

క్రౌన్ సైజు 62పుటలు వెల 0—8—0 వ్యాఖ్యానకర్త: ముమ్మన్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు, అమృతలూరు. ఆర్యసంస్కృతి క్షీణించుచున్న ఈ నవ్యయుగంబున ఈ సుప్రసిద్ధాంధ్ర పండితుడు ఆత్మవిద్యకు ముఖ్యస్థానమగు నీకేనోపనిషత్తునకు తృప్తికరమగు వ్యాఖ్యానము వ్రాసి తెనుగువారి కరకమలముల కందించినారు. బ్రహ్మవిద్యాజిజ్ఞాసువు లెల్లరునుజదివి వాంఛితార్థములం బడయుదురుగాక.

## ఈశోపనిషద్

భాషా సంజీవినీ సంఘ గ్రంథమాల ప్రథమకుసుమము. వ్యాఖ్యానకర్త: ముమ్మన్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు. ఈచిన్న పుస్తకమున పదునెనిమిది మంత్రములుగలవు. పరాపర బ్రహ్మల స్వరూపమిందు చక్కగ నిరూపింపబడినది. భాషసరళమగుటచే నెల్లరకును సులభగ్రాహ్యమై యున్నది. వెల 0—4—0 మాత్రమే.

# యుద్ధరంగము

★ రష్యా జర్మనీ సంప్రదింపులు

★ టర్కీ బల్గేరియాల సందిగ్ధ స్థితి

★ తూర్పుఖండంలో జపాను ఎత్తులు

— అరుంధతి —

ఇంగ్లాండును పూర్తిగా జయించి యూరపు ఖండములో జర్మనీ అధికారాన్ని స్థిరస్థాయి చేయాలనే ఉద్దేశ్యాలతో హిట్లరు ఇంగ్లాండు మీద గత నాలుగు మాసములనుండి జరుపుతూవచ్చిన విమానదాడి యీ మాసంలో చాలావరకు చల్లబడింది. ఇన్నాళ్లనుంచి యీ విమానదాడులవల్ల లండను నగరంలోని సెంట్ పాల్సు కెథడ్రల్ మొదలైన ప్రాచీన కట్టడాలకు హానికాటిల్లి, కొంతవరకు నష్టకరమవడం తప్పితే హిట్లరు చేయగలిగిందేమీ కనపడలేదు. అందుచేత [ప్రయోజనంలేని] యీ దాడులవల్ల హిట్లరు కొత్త ఎత్తులు వేసుకోవలసి వచ్చింది.

పైగా అమెరికాకు రూజువెల్టు మూడోసారి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అధ్యక్షుడైనప్పటి నుంచి రూజువెల్టు ప్రసంగాలలో ఇంగ్లాడుకు ఎక్కువగా సహాయం చేసేసూచనలు కనబడుతున్నాయి.

ఇది ఇలా వుండగా మధ్యధరాసముద్రంలో అనుకున్నంత అధికారం లభించకుండా వుంది. ఈజిప్టుతో యుద్ధం పచ్చివెలక్కాయి గొంతుకలో పడ్డట్టయింది ముసోలినీకి. ఈజిప్టును జయించి మధ్యధరాలో అధికారాన్ని స్థాపించుకుంటేనే గాని జిబ్రాల్టరు స్వాధీనం అవదు. అందుకోసం ఇటలీ తన యుద్ధక్రమాన్ని నల్లసముద్రంవైపు త్రిప్పవలసి వచ్చింది. మధ్యధరాసముద్రంలో చాలా ఉపకరించే దీవులు, కార్ఫూదీవి, క్రీట్ దీవి - మొదలైనవి గ్రీసుకువున్నాయి. ఇవి లోబరుచుకుంటే ఈజిప్టును వోడించడం చాలా సులువౌతుంది. అందుకోసం గ్రీసును జయించాలి. కాగా ముసోలినీ గ్రీసుతో యుద్ధానికి తలపడ్డాడు.

మొదటి నుంచి గ్రీసుకు ఇంగ్లాండు సానుభూతి చూపడమే కాకుండా సహాయం చేస్తూనేవుంది. విమానబలం మూలకంగా సహాయంచేయలేక పోయినప్పటికి మధ్యధరాలో గ్రీసుదీవులకు యేలాటి అపాయమూ రాకుండా కాపాడుతోంది.

## ★ రష్యా జర్మనీ సంప్రదింపులు

గ్రీసు, అల్బేనియా మొదలైనవాటిని లోబరుచుకుని, అటు నల్లసముద్రంలో నౌకాబలాన్ని స్థాపించుకోవాలని జర్మనీ, ఇటలీలు ప్రయత్నిస్తున్నాయి. ఇందుకోసం రష్యా యొక్క ఉద్దేశ్యం ఏమిటో తెలుసు కుందుకు సంప్రదింపులు జరిగాయి.

తదనుగుణ్యంగా రష్యా విదేశాంగ మంత్రి మాలటావ్ బెర్లినువచ్చి హిట్లరుతో సంప్రదింపులు జరిపాడు. ఈ సంప్రదింపులు ప్రధానంగా ఆర్థిక సహాయం సంబంధమైనవేకాక, రాజకీయ సంబంధంకూడా వున్నదని అనుకుంటున్నారు.

కాని నల్లసముద్రంలో నౌకాబలాన్ని నిర్మించుకోవడానికి రష్యా ఒప్పుకోలేదు. అందుచేత సిరియా, పాలస్తైనులకు సైన్యాలను తీసుకుపోవలసి వచ్చినప్పుడు టర్కీగుండా వెళ్లాలికనుక, టర్కీ ఒప్పుకోకపోతే, టర్కీవప్పుకున్నా, అందుకు రష్యా అంగీకరించవలసి వుండడంకూడ యీ సంప్రదింపులలో జరిగి వుండాలి.

రష్యాను సంతృప్తి పరచడానికి అటు జపానును చైనాతో ఎక్కువ సంబంధం పెట్టుకోక ఇండో చైనా విషయం చూచుకోవలసిందని ఇటలీ జర్మనీలు జపానుకు సలహా ఇచ్చివుండవచ్చును.

అంతే కాని, రష్యా—జర్మనీ, ఇటలీ, జపానులతో పూర్తిగా ఏకీభవించి ఇంగ్లాండుతో పోరుకు తలపడుతుందను కోవడం పొరపాటు. జర్మనీ, ఇంగ్లండులు ఒకరితో ఒకరు పోరాడి, యుద్ధంలో ఎవరు నెగ్గినా, చివరకు యిద్దరూ బలహీనులైపోయి వుండడం రష్యా అభిమతమై వుండాలి. కాని యిరువురిలో ఎవరితోనూ కలియదు. ఇది నిజం.

వివిధ విషయాలనన్నిటిని చర్చించుకొనేందుకు హిట్లరు, మొలటోవ్‌లు సంప్రదించి అప్పటినుంచి హిట్లరు, యూరపులో చిన్న రాజ్యాల యొక్క రాజుల్ని, మంత్రుల్ని అందర్నీ జర్మనీకి రప్పించి వాళ్లతో చర్చలు జరుపుతున్నాడు.

రష్యా ఇంత తటస్థంగా వుంటుందని హిట్లరు గ్రహించగానే యీ చర్చలు కొనసాగిస్తున్నాడు. వియన్నాలో స్లొవాకియా, హంగరీ, రుమేనియా, జర్మనీ, ఇటలీ, బల్గేరియా, యుగోస్లావియా ప్రతినిధులు సమావేశమై యూరోపు ఖండం యొక్క నూతనరాజ్యాంగ విధానాన్ని స్థిరపరచ దలచుకున్నట్టు వార్తలు తెలుపుతున్నాయి.

### ★ టర్కీ బల్గేరియాల సందిగ్ధ స్థితి

యూరపులో ఎన్ని దేశాలు తన అధికారంక్రింద వున్నాయో యీ సమావేశంవల్ల ప్రపంచానికి చూపించి తనకు పూర్తిగా లొంగనటువంటి బల్గేరియా, గ్రీసు, టర్కీలను భయపెట్టి యుద్ధం అవసరంలేకుండానే ఆయా దేశాలను ఆక్రమించుకో దలచినట్లు తోస్తోంది.

ఈ పరిస్థితులలో బల్గేరియా రాజు బోరిస్ జర్మనీకిపోయి తనవంటి చిన్న దేశాలను బాధపెట్టవద్దని వేడుకోవడం చూస్తే, రష్యా బల్గేరియాను సహాయం చేయుదని నిరూపణ అవుతోంది. ఇక టర్కీ, యూరపు లోని యుద్ధజ్వాలలు తనమీదికిరాగానే ప్రాణాలతో ప్రజల ఆస్తులు, సర్వం టర్కీ మిలటరీఅధికారుల స్వాధీనం చేయాలని వుంటుందని ప్రకటించింది. అటు గ్రీసుకు బ్రిటను సరియైన సహాయంపంపడం మానుకుంది. ఇవన్నీచూస్తే, బల్గేరియా, గ్రీసు, టర్కీలను జర్మనీఇష్టానికి వదిలేసి రష్యా తప్పుకున్నట్టు కనపడుతోంది. టర్కీ జర్మనీతో యుద్ధం తప్పించుకోవాలంటే ఇటలీ, జర్మనీ, జపానులతో ఏకీభవించి, బ్రిటనును నిరాకరించి, యూరపుఅంతా హిట్లరుదే అని ఒప్పుకోవాలి. ఇప్పుడు టర్కీ ఏంచేస్తుందో చూడవలసివుంది.

ఇటు, ఇంతకాలం నుంచీ తటస్థంగావున్న స్పెయిన్‌కూడా ఇంగ్లాండుతో యుద్ధానికి తలపడే ప్రయత్నంలోవుంది. స్పెయిన్ విదేశాంగమంత్రి సునేర్ జర్మనీవెళ్లి మంతనాలు జరపడమూ, జిబ్రాల్టరును స్పెయినునుండి వేరుచేయడానికి బ్రిటీషువారు కాలువతవ్వడమూ అన్నీచూస్తే స్పెయిన్ జర్మనీ, ఇటలీ, జపానులతో కలసి ఇంగ్లాండుతో యుద్ధానికి తలపడుతుందని స్థిరమయింది.

### ★ తూర్పుఖండంలో జపాను ఎత్తులు

ఇటు తూర్పుఖండంలో జపాన్ చైనాతో సంధిచేసుకునే సూచనలు కనుపిస్తున్నాయి. ఇదంతా ప్రస్తుతంలో రష్యాతో విరోధంతెచ్చుకోకుండా, దానిని తృప్తిపరచడానికేగాని వేరుగాదు. ఇందుకు జర్మనీ ఇటలీల ప్రోత్సాహమే కారణం. అందుచేత జపాను ఇండోచైనాతో తలపడింది.

ఈ పరిస్థితులలో అమెరికా బ్రిటనులు సయాం, ఇండోచైనాలతో స్నేహంకుదుర్చే ప్రయత్నలో వున్నాయని నిందలు బయలుదేరుతున్నాయి. ఇటు చైనాతో యుద్ధంఆపి, ఇండోచైనా సయాములను ఆక్రమించుకోడానికి ప్రయత్నిస్తూ, జర్మనీ ఇటలీలతో స్నేహంగా వుంటూ, రష్యాతో తటస్థంగా వుంటూ, క్రొత్త ఎత్తులువేస్తూవున్న జపానునుచూచి అమెరికా ఇంగ్లండులు చాలా జాగ్రతగా వుండవలసివుంది. ఈ పరిస్థితులు విషమించిననాడు యుద్ధ పరిస్థితులు ఇండియానుకూడా సమీపిస్తున్నాయని అనుకోవలసి వస్తూవుంది.

మొత్తంమీద, ఆరోదాకారోదా యుద్ధక్రమం బాగా తీవ్రంఅవుతూ, క్రొత్తరూపాలను పొందుతూవుంది అనిమాత్రం చెప్పగలము.

# పత్రికా పరిచయం

### యువకళ

సంపాదకులు : శ్రీ పుట్రేవు వెంకటభాస్కరరావుగారు. కార్యాలయం: గాంధీనగరం, వాల్తేరు R. S. సంవత్సరచందా ఒకరూపాయి. విడిపత్రిక ఒక అణా.

ప్రథమ సంపుటం, ప్రథమసంచిక మా కార్యాలయచేరింది. పత్రిక చాలా చక్కగావుంది. రచనలు చిరపరిచితులైన యువకులవవటంచేతను, ఆధునిక సామాజిక పరిస్థితులకు సంబంధించిన భావాలవటంచేతనూ మంచి హృదయంగమంగా వున్నాయి. కథలకు, నాటికలకూ 'యువకళ'లో ఎక్కువ ప్రాముఖ్యతవుంది గనక, సజీవమైనభాషలో సజీవమైన భావాలను ప్రజానీకంలో ప్రబోధంచేసి, 'యువకళ' సార్థకత్వం సంపాదిస్తుందని విశ్వసిస్తాము.

### భీమాసేవ

సంపాదకులు : శ్రీ దంతుర్తి శాంతయ్యగారు, విజయనగరంసిటీ. సంవత్సరచందా రు 2_0_0 విడిపత్రిక 3 అణాలు.

కంపెనీలకును, ప్రతినిధులకును, పట్టాదారులకునుమధ్య పరస్పర సమరసభావమును పెంపొందించడానికి, పల్లెటూరి ప్రజలలో భీమా ఉద్యమమునుగూర్చి ప్రబోధంచేయడానికి యీపత్రిక పాటుబడుతుంది. ఆర్థిక వడగాడ్పులులేక, "భీమాసేవ" పదికాలాలపాటు ప్రజాసేవచేసి, భీమావృత్తి యెడల అకారణంగా వ్యాపించివున్న దురభిప్రాయాలను పారదోలుతుందని ఆశిస్తాము.




## 15 వ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ

నంద్యాలలో గతమాసము 24వ తేదీని ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ 15వసారిగా సమావేశమై అత్యంత జయప్రదముగ జరిగినది. క్లిష్ట సంకులితమైన నేటి రాజకీయ పరిస్థితులలో నిది సమావేశమై ఒకేయొక విశిష్ట దృక్పథములో సాగిపోయినందులకు, సమావేశకర్తలగు విదుషీమణుల నభినందించుచున్నాము.

సభాధ్యక్షతవహించిన శ్రీమతి కామేశ్వరమ్మగారి ప్రసంగము మహిళా మహాసభకు ఒక నూతన దృక్పథమును ప్రసాదించినది. ముఖ్యముగ, ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ "దేశీయసంస్థగా మారవలెను" అను వారి నూతన కార్యప్రబోధము ప్రస్తుత సామాజిక పరిస్థితుల కెంతయు అవసరమైయున్నది.

15 సంవత్సరములనుండియు మహిళోద్యమము అవిచ్ఛిన్నముగ జరుగుచున్నను, మహిళా మహాసభ చేసినకార్యము చెప్పుకోదగినదేదియు గానరాదు. ఇందుకు యీ దృక్పథములేమియే కారణమేమో!

సాంఘిక దుర్నీతులు, స్త్రీ విద్య మొదలగు వాటిని గురించి ఎవరికిదోచిన విషయము లను వారుచెప్పి, తదనుగుణ్యమగు తీర్మానముల గావించుటయేదప్ప నిర్మాణమును సూచించు కార్యక్రమ మెద్దియులేక, సంస్థ నిర్వ్యాపారముగ నిల్చిపోయినది.

ఏ కొలదిమందినోతప్ప ఆంధ్ర స్త్రీలోకమునంతను కూడదీసుకొన లేకపోయినదన మహిళా మహాసభయొక్క కార్యక్షేత్ర మెంత సంకుచితమైనదో మనము గ్రహింపగలము.

ఆంధ్రరాష్ట్రమహిళా మహాసభకొక కేంద్రస్థానము మున్ముందుగ స్థాపింపబడవలయును. కార్యక్రమమును వివిధశాఖలుగ భాగించవలయును. యీ శాఖలకు తగిననిర్వాహకురాండ్రను (Organisers) ఏర్పాటు చేయవలయును. వీరు ఊరూరాతిరిగి ప్రచారముచేసి, ప్రతిగ్రామమునందును మహిళాసంఘముల స్థాపించి కేంద్రములో సంబంధము కలుగజేసి, కార్య ప్రణాళికతో వెంటనే ప్రబోధము చేయవలసియున్నది.

రాజకీయ సాంఘిక, ఆర్థిక, పారిశ్రామికముగా స్త్రీలలో మానసిక పరివర్తన కలిగినగాని ఇది సంపూర్తిగాదు. అప్పుడు గాని ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ "దేశీయసంస్థ"గా మారజాలదు.

శ్రీమతులు దుర్గాబాయమ్మ, కామేశ్వరమ్మ, రామసుబ్బమ్మ, రత్నమ్మ, భారతీరంగా మొదలైన విద్యావతులు- వివిధ కార్యరంగములలో కృషి చేయుచున్న విదుషీమణులు- ప్రస్తుత స్త్రీ నాయకురాండ్రు- యీ విషయమున ఏల శ్రద్ధ బూనకూడదు? అందరుచేరి మహిళామహాసభకొక విశిష్టరూపమునిచ్చి ఆంధ్రదేశ మహిళా లోకమునంతను ఏల వికాసవంతము చేయరాదు?

రాష్ట్రకార్యరంగమును తేజోవంతముజేసినగాని అఖిలభారతరంగము వీరికి సువిశాలముకాజాలదు. అందువలననే అఖిలభారతరంగమునందు పనిచేయు స్త్రీలు మన ఆంధ్రులలో ఒక్కరైనను గానరారు.

కావుననే ఇటీవల ఏర్పడిన నేషనల్ ప్లానింగుకమిటీ స్త్రీల ఉపసంఘములో ఆంధ్రసోదరీమణి యొకరికైనా స్థానములేక పోయినది. ఇది ఆంధ్ర స్త్రీలోకమేమాత్రము ఉపేక్షింపదగిన విషయముగాదు.

ఇట్టి దేశహితములగు స్థానలబ్ధికి, మున్ముందు రాష్ట్రీయాయతత్వము ప్రాతిపదిక. రాష్ట్రసంఘమును చక్కని నిర్మాణపంథలోనడిపి, ఉజ్వలమైన స్త్రీ సంఘమును నిర్మించి, మహిళామహాసభకు సార్థకత్వమును ప్రసాదించుట నేటి స్త్రీ నాయకురాంధ్ర కనీసధర్మము. ప్రతి గ్రామమునందును స్త్రీ సంఘముల స్థాపించి, గృహపాలనము, జాతీయ ప్రబోధము మొదలుగాగల సాంఘికపునర్నిర్మాణము గావించి, దేశీయ దృక్పథములో నడకసాగించి, ఆంధ్రభూమియందేగాక యావద్భారతభూమియందును ఆంధ్రస్త్రీలు ప్రముఖస్థానము పొందునట్లు ఆంధ్రరాష్ట్రమహిళా మహాసభ ప్రయత్నించునని విశ్వసించుచున్నాము.

◆ ◆ ◆ ◆

## ఆంధ్రయువతీమండలి - హైద్రాబాదు

ఐదు సంవత్సరములకు పూర్వము స్థాపింపబడి, యీ ఐదు సంవత్సరములుగ హైద్రాబాదు స్త్రీలోకములో విజ్ఞానాభివృద్ధికి పాటుబడి కొంత కృషికరముగ పనిచేసినట్లు 'ఆంధ్రయువతీమండలి' వారి ఐదవ వార్షిక నివేదికవలన స్పష్టమగుచున్నది. చిత్రకళ, సంగీతము, వ్యాయామము మొదలైన విషయములయందు ప్రబోధకరములైన ఉపన్యాసముల జరపుట, కుట్టుపని ఆదిగాగల పనులు ఉచితముగ నేర్పించుట, స్వదేశీ వస్తు ప్రదర్శనముల నిర్వహించుట, మొదలగు స్త్రీ జనోపయోగకరములైన వివిధవిషయ ప్రసక్తిని నిర్వహించిన మండలివారు ఎంతయు అభినందనీయులు.

కాని, ఇట్టి సముచితమైన కార్యకలాపము కలిగిన యీ మండలియందు నూరుమంది సభ్యులైనను లేకపోవుట ఏమాత్రము ఉత్సాహకరముగలేదు. మండలిలో హైద్రాబాదు స్త్రీలందరు చేరినగాని మండలి తన విద్యుక్త ధర్మమును నిర్వహించలేదు. ఈ స్త్రీమండలికి స్వంతభవనము నిర్మింప దలపెట్టబడినదని, అందులకు శ్రీ గద్వాల మహారాణిగారు వేయిరూపాయలు విరాళము నిచ్చియున్నారని నివేదికలో ప్రకటింపబడినది. ఇందుకు శ్రీమంతులు, ఉదారవంతులు తోడ్పడవలసియున్నది. స్వాయంసహాయము వల్లనే యీ మండలి ఇట్టివిషయములయందు కృషిచేసి విజయవంతము గావలసియున్నది. హైద్రాబాదు నారీలోకముయొక్క సంపూర్ణ సహకార సానుభూతులతో యీ మండలి సర్వతోముఖముగ అభివృద్ధిజెందిన, నేడు సంస్థాన పరిపాలనయందు కొనితేబడుచున్న స్త్రీ జనహితములగు శాసనములకు అఖండమైన సహాయము నీయగలదు.

ఐదవవార్షికోత్సవ సమావేశమున కధ్యక్షత వహించిన శ్రీమతి రామసుబ్బమ్మగారి అధ్యక్షోపన్యాసములో హైద్రాబాదు నారీలోకమునకు నూతనకాంతినిచ్చు విషయములు చక్కగ విశదీకరింప బడినవి. వీరి అధ్యక్షత రాష్ట్రరాష్ట్రేతర సంబంధప్రోత్సాహమేగాక, అభిప్రాయ సమీకరణకుకూడ దోహద మొసగుచున్నది.

మహిళాప్రపంచమున కుపకరించు సర్వసమస్యల యందును చక్కని పరిశ్రమజేసి, బ్రిటిషుపాలితాంధ్రులకన్న హైద్రాబాదు ఆంధ్రులువెనుక బడియున్నారను ప్రతీతిని నామమాత్రమునుజేయ 'ఆంధ్రయువతీ మండలి' పాటుబడుగాకయని కోరుచున్నాము.

---

**Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.**